శ్రీః

# భక్తకుచేల

## (భక్తసుధామ)

ఇయ్యది
కృష్ణలీల, లవకుశ, విభీషణపట్టాభిషేకాద్యనేకనాటకరచయితలగు
బళ్లారి వైయాకరణ, పండిత:
కే. సుబ్రహ్మణ్యశాస్త్రివిరచితము





రెండవ కూర్పు 1000 ప్రతులు.

ప్రకాశకులు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,
రాజమండ్రి.
1940.

# కృతిసమర్పణము.



శా. శ్రీవాసిష్ఠమహాన్వయం బవనిఁదా జెన్నారువిఖ్యాతమై
భూవంద్యంబునునై బుధాసుయుతమై పుణ్యక్రియారాశియై
సేవాతోషితపార్వతీశ చరణార్చిర్దీప్తఫాలస్థలం
బై వేదాగమసంపఠద్వినతశిష్యానీకవాచాలమై !

శా. ఆమాన్యాన్వయక్షీరరాశినుదయం బయ్యెన్ శశాంకుండు నా
రామస్వామిబుధేంద్రుఁ డాశ్రితబుధారాముండు గీర్వాణనా
గ్రామంధ్రాబ్జముఖీలలామలభువిన్ రంజిల్లఁగాఁజేయ శ్రీ
రాముండే యవతారమందె ననఁగన్ బ్రాంచద్బుధారాముఁడై !

ఉ. రూపము వీడి సద్గుణసురూపముఁబాసి యలంక్రియాదులన్
దాపముతోడ నీగి గళితప్రవిబోధయు నౌ సరస్వతిన్
బ్రాపితశోభగాన్ విబుధభాస్వరగాన్ స్వరగా నొనర్పఁగా
నీపరిజన్మమందెఁ బరమేశుఁడు రామబుధేంద్రనాముఁడై.

మ. ఉదయం బొందెను తత్సుధీవిమలగర్భోద్దీపదీప్తిన్ బ్రదీ
పదశన్ మీఱికులేందుశేఖరుఁడు గీర్వాణాంధ్రగీరాంగ్లశా
రదఁగై సేయఁగ దివ్యకీర్తిసుగుణోల్లాసానుసంస్ఫూర్తి సం
విదహృద్యాంచిత వేంకటేశ్వరప్రథావిద్యోతసన్మూర్తితోన్ !

సీ. సర్వకళోల్లాససారస్వతముఁ బెంచె
సద్గ్రంథ ప్రకటన సరణి నెసఁగు
పచ్చయప్పసుకళావాసాధి పతియాచు

సిరియు శారదయుఁ దన్నిరువంకలను గొల్వ
గర్వవిహీనతఁ గాంచెనెవఁడు

సీ. బ్రహ్మసుగుణాఖనికిఁ బ్రహ్మానందమూర్తికి
నిరతరతికి నిగమానుసరణికి
శాంతిధనునికి సౌశీల్యరసాంబుధునికి
వేంకటేశ్వరశాస్త్రికి విమలమతికి.

గీ. అంకిత మొనర్తు సురుచిరయశము నొసఁగు
పుణ్యచరితంబు భక్తిసంపూరితంబు
అతులితైశ్వర్యదాయకమగు కుచేల
నామకావ్యకన్యక హరి ప్రేమ వెలయ !

గీ. పుత్రపౌత్రాభివృద్ధిసంపూజ్యకీర్తి
చిరతరైశ్వర్యపదవులు చెలఁగుఁగాత !
మాయురారోగ్యవిభవంబు లలరుఁగాత !
ధరణి వావిళ్ళ వేంకటేశ్వరుల కెపుడు !

గీ. కృతికితోధికాదరణ శ్రీకృష్ణభక్తి
ధర్మనిష్ఠయు ధనయశోధాన్యవృద్ధి
కావ్యపోషణ భోగభాగ్యంబులంది
యలరుఁ గావుత సర్వసన్మాన్యుఁడగుచు !

చెన్నపురి,
5—8—33.

బళ్లారి పండిత కే. సుబ్రహ్మణ్యశాస్త్రి.
రచయిత.

# తొలిపలుకు



మిత్రప్రేరణముచే రచియింపఁబడిన యీభక్తకుచేల (సుధామ) నాటకము (బ్రహ్మ) బరంపురమున కలెక్టరుగారగు మ. రా. శ్రీ. భాస్కరరావు నాయఁడుగారి సమక్షమునను, ప్రతిపత్తననగరగ్రామజాన పదములందును జమీందారుల విద్యాధికుల - పత్రికాధిపతులసమక్షము నను ఖేలనమొనర్పఁబడి వారిమన్ననపూర్వక ప్రశంసావాక్యములంది, పండిత పామరజనసమాదరణవడసి పత్రికారాజములపొగడ్తనందినది.

భాగవతమున నతిక్లుప్తముగ వర్ణింపబడినకథను గైగొని కథా సరణికి విరుద్ధములుకాక కాలదేశపాత్రౌచిత్యైక్యాదులకు భంగ మ్మాపాదింపని మనోహరకల్పనలతో కవి దీనినైదంకములనాటకముగ రచించెను.

నారదునితో కుచేలుఁడు 'దినము ప్రాతఃకాలమున' యనుచు తనవృత్తిని వచించినట్లు ప్రథమరంగమునుండి శిశుపాలునియాస్థాన రంగము ముగియువఱకును నొక్కదినమున—ప్రాతఃకాలమునుండి సాయంతనమువఱకు ప్రవర్తిల్లినవిషయములు—కవికల్పన యంతయు నభివర్ణితములగుట చదువరు లెఱుంగఁగలరు !

ప్రప్రథముననె 'హరియే గాకు ప్రభుండు' యిత్యాదియున్నత భక్తితత్వబీజములనాటి కొన్ని నిముసములకే—మూరంగముననే—తనయుని యాకలిబాధ కోర్వక విలపించుచు నారదుఁడు వచించిన తెఱంగున 'దారపుత్రాద్యభిమానమును సంపూర్ణముగ బాయకుండు ట' యు చూపి, కవికుచేలునిపాత్రను ప్రతీకాదినవవిధభక్తిసోపాన ముల నధిరోహింపఁజేసి, సర్వమును శ్రీకృష్ణమయముగ గాంచు

కల్పితపాత్రలలో ప్రాముఖ్యములగు సరోజినీకరటకులసృష్టియు శ్రీకృష్ణవిద్వేషియు సమకాలికుఁడును నగుశిశుపాలునిం దను సంధానించుటయు కుచేలునినిష్కామత్వజ్ఞానవైరాగ్య శాంతముల పోషణకు సాధనములగుచున్నవి. బ్రహ్మమానసపుత్రుఁడును పరమవైరాగ్యశిరోమణియునగు నారదుఁడీనాటకమున మాత్రము కవివర్యులయలంకార చమత్కృతిభాగ్యమునకలిగిన తనకలహాశనత్వమును మాని శ్రీకృష్ణ లీలాకర్మసూత్రధారిత్వమును వహించి కుచేలునిభక్తి జ్ఞానాభివృద్ధిని లోకదర్పణమున ప్రతిఫలింపఁజేయువిమర్శకస్థాన మలంకరించు టెంతయు ముదావహము.

ఆత్మీయలావణ్యశృంగారగర్వము లోకవంక నీడ్చుచుండ— పూర్వార్జితపుసుకృతకర్మబీజములు హృదయమున దాగి పల్లవించి భక్తి జ్ఞానఫలము లొసంగ నుంకించుచుండ, సత్యావాదమును సమర్థింప నేతెంచినమోహిని, కుచేలుని జితేంద్రియత్వనిష్కామత్వాదుల ప్రకాశింపఁజేసి స్థూలదృష్టికి పరాజితయైనట్లు గోచరించెడిని కాని, పూర్వరంగమున నైశ్వర్యము మోక్షసాధకమను సత్యావాదము నొకవిధముగ సమర్థించి, నదియు పారంపర్యమోక్షసాధకమగుట నిర్వచించి కుచేలునియైశ్వర్యప్రాప్తితో నేకీభవించుచున్నదని వచించి విరమించువాఁడ!

కాకినాడ,
15–8–33.

బుధవిధేయుఁడు,
కే. బాలసరస్వతి, బి. యే., బి. యల్.

# నాంది.

శా. శ్రీసంధిల్లఁగ రుక్మిణీసహితుఁడై శ్రీమత్కుచేలాంతరో
ద్భాసుల్ వేయడుకుల్ భుజింప ముఖపద్మంబందు బ్రహ్మాండసం
వాసంబుల్ గని విస్మయభ్రమరసావాస్త్రక్రుధోద్విగ్నయా
శ్రీసత్యాసతి నవ్వ శౌరిరుచిరస్మేరంబు మమ్మోముతన్ !



నాచే రచియింపఁబడి ప్రకటింపఁబడిన యీభక్తకుచేల (సుధామ) యను నాటకమునకు గల సర్వస్వాతంత్ర్యములు నాకు జెందియున్నవి. కాన, దీనిని భాషాంతరీకరింపవలయునన్నను, ఖేలన మొనర్పవలయు నన్నను, సినిమాకథగ నుపయోగింపవలయునన్నను, ప్రచురింపవలయు నన్నను నా యనుమతిని వ్రాతమూలమున పొందవలయును. అటుగాక స్వతంత్రించినవారలు నానష్టమునకు న్యాయసభల సివిలుక్రిమినలు చర్యలకును పాత్రులగుదురు.

చెన్నపురి,
5—8—1933.

బళ్లారె పండిత కే. సుబ్రహ్మణ్యశాస్త్రి.

# రాజపోషకులు.



మ. రా. శ్రీ వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు,

తండియార్పేట, చెన్నపురి.

గౌరవనీయులు (ఆనరబుల్)

,, బెజవాడ రామచంద్రారెడ్డిగారు,

శాసనసభాధ్యక్షులు, చెన్నపురి.

,, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు,

ఆంధ్రపత్రికాధిపతి, చెన్నపురి.

,, రేబాల పట్టాభిరామరెడ్డిగారు,

జమీందారు, నెల్లూరు.

,, లచ్చుందొరగారు, ప్రొప్రయిటరు,

తోటపల్లివగైరా ఎస్టేట్లు, కాకినాడ.

,, దివానుబహదూరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణ

మూర్తినాయుడుగారు,

కాకినాడ.





శ్రీ

# భక్తకుచేలనాటకము.

ప్రాక్పరంగము—ద్వారక.

[శ్రీరుక్మిణియంతఃపురము - రుక్మిణి తులసిపూజఁ జేయుచుండును. బ్రాహ్మణులు మంత్రములు చదువుచుందురు. ప్రవేశము సత్యా కృష్ణు లిరువురు వైపులనుండి, సత్యముందుఁబోవ కృష్ణుఁ డాపి.]

కృష్ణ:—ప్రేయసీ! సత్యా! చూచితే! సోదరి రుక్మిణి నిర్మలభక్తి యోగమహామహిమను!

మ. అదె కంటే! కను లర్ధమీలితములై యానందమున్ జెల్వ మేల్
వదనాంభోజము భక్తియోగమహిమన్ పైపైన చాటంగ స
ముద్గదబాష్పావళి చెక్కుటద్దముల సొంపుల్ పెంప సంగంబును
త్పదమై దోఁపఁ యఖండభక్తివశయై దర్పెనిన్ భామినీ!

[రుక్మిణి సత్యాకృష్ణుల పుష్పగంధాదుల నర్చించి]

రుక్మి:—ధన్యాస్మి! ధన్యాస్మి! నాథా! సర్వతపములకును, సర్వవ్రతములకును, ఫలభూతుఁడవు నీవకావా! అట్టి నీవు నాసోదరి సాత్రాజితితో నిందు విచ్చేయుటచే నేనెంతయు కృతార్థనైతి!

సత్య:—సోదరీ! మహదైశ్వర్య విరాజితులగువారి కీవ్రతములేల? తపములేల? సర్వాభీష్టములు సమకూర్చ సంపదయేకదా కారణము!

సీ. చెలికాండ్ర పెక్కండ్ర చేర్చును నొకవేళ
యతుల యోగుల నెంతొ యాదరించు
యజ్ఞయాగాదుల నమరుల తనియించు
దీనుల రోగుల దీవిరిబ్రోచు
ప్రజల దన్నాతురపజల తా పోషించు
సూరిజనావళి గారవించు
నతిథుల నభ్యాగతాంధుల వెలయించు
దేవతీర్థార్చనదీప్తిఁ బెంచు
గీ. సుఖసమానందశాంతిసంశుభము లొసఁగు
చింత నణఁగించు సత్కీర్తి సంతరించు
గుణము లలరించు స్వర్భోగ మొనసి బెంచు
ధరణి నైశ్వర్యమే యెందు తారకంబు!

రుక్మి:—సోదరీ! రాగద్వేషాద్యుత్పాదనకారణములై నిఖిలానర్థమూల కందములైన సంపద లెన్నటికైన మోక్షైకసాధనములగునా?

సీ. కన్నులుండియు సూరిజనుల కానఁగ నీదు
శ్రోత్రముండియు హితసూక్తి వినదు
దుండగీడులజేర్చి దుండగంబులగూర్చు
దోసంబు నీసు దుర్బుద్ధిఁ బెంచు
గిరునంబు గరుసంబు దురభిమానముఁ బెంచు
జపతపాదులయందు శ్రద్ధ నొంచు
విషయాభిలాషల వెలయించు దరిమించు
భోగరోగాళుల పోలుపు నించు
గీ. యిహమె మోక్షమంచనుబుద్ధి నెలమిఁ బెంచు
పాపతతిఁ బెంచు గురుడైవభక్తి నొంచు
కాంచ సంపదయే పాపకారణంబు
నిరయమార్గంబు నీచంబు నిందితంబు.

సంపదలయందలి విరక్తియే పరమవైరాగ్యమునకు కారణమగు చుండ సంపదలే తారకములగునా?

సత్య:—'వైరాగ్యము వైరాగ్య' మనియెదవుకాని యావైరాగ్యము మాత్ర మూరకవచ్చునా? సర్వైహికసంపదల నవారిగ ననుభవించి విసికి వేసరినకదా యించుకవైరాగ్య మలవడును!

రుక్మి:—సంపదల ననుభవించినకాని వైరాగ్య మలవడదనియా నీ యభిప్రాయము? అయిన సత్యా! పుట్టినప్పటినుండి యడవుల యందే వసించు తాపసులకు సత్త్వగుణ మెట్లలవడియె?

సత్య:—సంపదలచవి చూడకుండుటచే.

కృష్ణ:—(స్వగ) భళి! ఈయుభయవాదములును నాసంకల్పమున కనుగుణములుగనున్నవి. ఈభక్తిపరీక్షానాటకమునకు నారదుని పాత్రయే తక్కువ!

సత్య:—పోవనిమ్మక్క! ఈ వైరాగ్యపుముచ్చులనుండి జగమున కేమి లాభము? దాన మొనర్పఁగలరా? ధర్మము చేయఁగలరా? అంతయేల? సిరిలేదని మొఱయిడుచున్న యాశ్రీహరిసైతము సిరులఁ గాంచి యైశ్వర్యమును తిలకించి రుచులుకలిగి వజ్రమయకిరీటమనియు, మణిమయకేయూరములనియు, మరకతమణి కుండలములనియు, ఘనసారకస్తూరికాచందనచర్చలనియు, పట్టుపీతాంబరములనియు, తుదకు దక్షిణలనియు, పరులసంపదల కాసింపఁడా? శంకరుఁడు తాను భిక్షుకుఁడైనను కష్టించి యెట్లో మహాధనసంపన్నుఁడగు కుబేరునిచెలిమి సంపాదింపఁడా?

రుక్మి:—ఈయైశ్వర్యపిశాచములన్నియు భోగపరాయణలమానసముల బాధించును కాని—

సత్య:—ఏమీ! ఏమీ! నేను భోగపరాయణనా! దానధర్మాదుల మాని, కపటవైరాగ్యముబూను నీవు లోకవంచకపరాయణవా! నాథా! నాథా! వినుచున్నాఁడవా?

కృష్ణ:—(స్వగ) ఇప్పుడు గాంభీర్యము రసవత్తరఘట్టములోనికి దిగినది.

సత్య:— ఏమి! నాథా! వినుచున్నాఁడవా?

కృష్ణ:—ఆ వినుచునేయున్నాఁడను!

సత్య:—వినుచున్నాఁడవా! అయిన నేను భోగనారాయణనా!

కృష్ణ:—నీవు భోగనారాయణనా! భోగాధిదేవత వగుదువుగాక!

రుక్మి:—నాథా! భక్తివైరాగ్యములు కపటములా?

కృష్ణ:—కావు కావు! రుక్మిణీ!

మ. మది యామాధవుమూర్తిపై నిలిపి కామక్రోధలోభాదిదు
ర్గుణముల్ వీడి తనూజదారహితసంబంధంబు పోనాడి దు
స్సదవైరాగ్యము బూని సర్వమును తత్త్వారూప్యతన్ గాంచు స
న్మునభక్తాలికి యింటికల్పకములై మోక్షాదు లొప్పారవే!

లోకమున భక్తివైరాగ్యములే తారకములు! ఎవరేమన్న నేమి.

సత్య:—ఎవరేమన్న నేమి?—అయిన నామాట లంతనిస్సారములా?

కృష్ణ:—చెలా! వేదవచనములైన నొకపరి నిస్సారములైనకావచ్చును. కాని, సత్యభామావచనముల నిస్సారములను ధైర్యశాలి యెవఁడు? (లోన-౧ అనుబంధములోనిచరణము) అదే! నారద మహానీంద్రుఁడు వచ్చుచున్నట్లున్నది?

[ప్రవే: నారదుఁడు—అనుబంధము. ౧]

కృష్ణ:—సంయమీంద్రా! అభివాదనములు! విచ్చేయుము! ఈపీఠ మలంకరింపుము.

నార:—వాసుదేవమూర్తీ! మంగళమగుగాక!

రుక్మి:—మునీంద్రా! నమస్కరించుదాన!

నార:—కల్యాణమస్తు! అభీష్టసిద్ధిరస్తు! (సత్య నమస్కరింప) భద్ర (కృష్ణారుక్మిణుల తిలకించి) యిష్టార్థసిద్ధిరస్తు! ఏమిది. నేఁడు శ్రీ

కృష్ణమూర్తి యొకవైపు, సత్యభామా కోపారుణితవదనకమలముచేతను మఱియొకవైపు, రుక్మిణీనిర్మలసాత్త్వికవదనసితాంభోజముచేతను నొక్కసారియే పూజింపఁబడుచున్నాఁడు! సత్యాదేవి ! సమస్తసంపదైశ్వర్యములచే సకలశిరోమాన్యవై విలసిల్లు నీవు మముఁబోలు వైరాగ్యధనులకున్నైతము పూజనీయవు కానా ?

సత్య:— మునీంద్రా ! నేను కపటవేషధారిణిని ! భోగపరాయణను ! తుచ్ఛతరసంపదలున్న నేమి మోహాదిసక్తులకుదూరను !

నార:— (స్వగ) ఓహో ! యిదియా విషయము ! ఇది శ్రీకృష్ణునివినోదలీల ! దీనిచే నాసర్వేశ్వరుఁ డెవ్వని నుద్ధరింపఁదలఁచెనో ! కావుననే యీలీలామానుషవిగ్రహుఁడు సంకల్పమాత్రమున నన్నింటను వచ్చునట్లొనర్చె ! కాని యీలీలానాటకమున నా పాత్ర నే నభినయింతు ! (ప్రకా) ఏమి ! సత్యాదేవి ! శ్రీకృష్ణుని ప్రేమపాత్రవై, అష్టభార్యలలోనెల్ల మేల్బంతివగునిన్ను 'భోగపరాయణ' యన సాహసించినవా రెవరు ?

సత్య:— ఇంకెవరు ? పావనభక్తియోగమహామహిమోపేతలగు రుక్మిణీదేవిగారే !

రుక్మి:— (నారదుఁడు రుక్మిణివైపుచూడ) మహర్షిచంద్రమా! నాసోదరి పరమవైరాగ్యధనుల నైశ్వర్యలోభమున ముంచి, జయించెదనని పట్టుపట్టి కుమార్గమున సంచరించుచున్నదే యని చింతించుచున్నదాన కాని—

సత్య:— ఏమీ ! నేను కుమార్గమున సంచరించుచున్నానా ! నీవు చాల సుమార్గమున సంచరించుచున్నదానవు కాఁబోలు! ఏమియహంకార మిది ! ఏమిగర్వ మిది ! ఇది నీతప్పుకాదు—

నార:—ఔను! ఔను! ఇది నిక్కముగ వాసుదేవమూర్తి దే తప్పు!
కాని, సత్యాదేవి!

గీ. మణుల నైసర్గకాంతు లమరినను నవి
సానబెట్టిన కాని విస్ఫారకాంతి
నందనట్లు యెంతచతురనైన రుక్మి
ణికడ భక్తిబోధ నొకింత నేర్వవలయు!

సత్య:—ఔరా! నారదా! యీసత్య నింత చులకనచేతువే! ఔను! నిన్నేల యనవలయు. యావజ్జీవము భరించి, లాలించి, పాలింప వలసిననాథుఁడే పరులు - పెఱవారు, చులకనచేసి, ధిక్కరించి నిందావాక్యములాడుచుండ ప్రత్యక్షముగనుండియు బధిరుని మాడ్కి, నిశ్చేతనునికరణి, కదలక - మెదలకుండిన నేనందఱి కిని చులకనకానా! నాథా! మాటాడవా! నీకంత కను వైన యీసత్య యింకేల యిందుండవలయు! (పోఁబోవ - ఆపి)

కృష్ణ:—సత్యా! శాంతింపుము! శాంతింపుము!

గీ. ప్రళయపవమానుధాటి సైపంగవచ్చు
సారదానవదోశ్శక్తి సైపవచ్చు
ప్రేమమోహప్రపూర్ణ సంవేశమైన
సత్యకంగల్వపాలికెంపు సైపనగునె!

నార:—తొలుత నిరసించి, పిదప శాంతివహింపుమన్న నేమిప్రయో జనము!

సత్య:—ఈదేవి - యీధర్మోపదేశపుపట్టపుదేవిమాటలే ప్రమాణము లాయెగా! ఔను! ఏలకావు? మీరందఱు భక్తిబోధా సంపన్నులు! వైరాగ్యధనులు! ఇఁక నేనొక్కతెనుకదా కపటవేషధారిణిని.

రుక్మి:—సోదరీ! శాంతింపుము! కామినులకు పతిభక్తియుండవలయు గాక.

సత్య:—అదిగో! మరల భక్తియనుచున్నావు! భక్తివలన నేమి లాభము?

నార:—నిక్కము! భక్తివలన నేమిలాభము! పాపము కుచేలుడు శ్రీకృష్ణునకు బాల్యమిత్రుడు కాడా? నిశ్చలతరభక్తియుతుడు కాడా? అతనికి భక్తివలన నేమిలాభము లభించె? ఆకటమాడుచున్న భార్యాపుత్రుల పోషింపగలిగెనా! యజ్ఞయాగాదిక్రియల నొనర్చి పుణ్యమార్జింపగల్గెనా?

సీ. జీర్ణమా శతపరిచ్ఛిద్రచేలమె గాక
సతికైన మంచివస్త్రములు లేవు!
దిన మర్ధకడుపుభోజనమెగా కొకనాడు
కడుపార భుజియించి కానడెపుడు;
కాయంబు గాసిల కటికనేల పరుండు
ఊగాని పాన్పుల నెఱుగడెందు!
శిథిలమై యుప్పుడో శిరముపై బడుకుటీ
రమెగాక దివ్యహర్మ్యములు లేవు

గీ. యింట నిర్వేదమునపిల్ల లేడ్పు ధ్వనులు
స్వస్తికాగ మంగళసూత్రభాగ్యమాత్ర
విభవమౌ భార్యతో కుచేల విప్రవరుడు
వరలుచున్నాడు మాధవభక్తుడగుచు!

రుక్మి:—మునీంద్రా! భక్తుడైనమాత్రమున కుచేలుడు పురాకృత కర్మ ననుభవింపవలదా!

సత్య:—అట్టివో భక్తియేల? భక్తి మానవులపురాకృతకర్మానుభవము నుండి తప్పించునా? దానధర్మములచేయించి పుణ్యలోకములకు దారికల్పించునా?

నార:—దీనిని శ్రీకృష్ణమూర్తియే నిర్ధరింపవలయు ! వాసుదేవమూర్తీ ! వింటివికదా యుభయవాదముల ! ఇందేదియుత్తమము !

కృష్ణ:—ఈయుభయవాదములును నాకెంతయు మనోహరములౌ విలాసములే ! ఈవాదములే కుచేలునిభక్తినాటకమునకు నాంది కాఁగలవు. పిదప మీకే తెలియఁగలదు !

సత్య:—తెలియుటేమి? తెలిసియేయున్నది? 'కృష్ణా ! కృష్ణా !' యని కనులుమూసుకొని జపమొనర్చినందుకు కడుపునిండ యాహారమైన లేకపోవుటయేకాఁబోలుభక్తికి ప్రతిఫలము. ఇదొక్కటి చాలదా లోకమున భక్తికన్న నైశ్వర్యమే యుత్తమమనిచాటుటకు !

నార:—ఔను ! నిక్కముగ చాలును. సత్యాదేవీ ! లోకమున ధర్మసంస్థాపనాచార్యవన్న నీవే !

సత్య:—నారదమునీంద్రా ! ఇపుడు నీవు తత్త్వవేత్తవనుట నంగీకరించితి ! విచ్చేయుము మందిరాభ్యంతరమునకు ! సోదరీ ! యిది యేమి యిట్టి .మహర్షిచంద్రుఁ డరుదెంచియుండ యర్ఘ్యపాద్య పూజాద్యుపచారముల సలుపక మసలుట భావ్యమా ! నాథా ! విచ్చేయరా ! (కృష్ణ - రుక్మిణి - సత్యలు నిష్క్రమింతురు)

నార:—నిక్కముగ ధర్మసంస్థాపనాచార్యయే ! ఇపుడుకానున్న—ముందైన కాఁగలదు ! (అను-) [ప్రవే. సత్య]

సత్య:—ఇదియేమి ? నారదా ! మరల 'భక్తి భక్తి' యని ప్రారంభించితివి?

నార:—ఏమియులేదు ! సత్యాదేవి ! నే నాకుచేలుని చూడఁబోవుచున్నాఁడను—

సత్య:—అట్లనా నారదా ! నీ వాకుచేలు నెట్లైన పరీక్షించి భక్తికన్న నైశ్వర్యమే యుత్తమమని సమర్థించి యీసత్య నెట్లైన కృతప్రతిజ్ఞగాఁ జేయవలయుసుమా !

నార:—హాహాహా ! ఎంతకయ్యోకదా యింతక్రమ ! అయిన.—

సత్య:—సందియమేల ! ఈనూర మోహినియను నొక వేశ్యయున్నది కదా ! ఆవెలవెలంది యెట్టిజడదారినైన నైశ్వర్యలోభమున ముంచి, ముక్కునకు గన్నుగట్టి, తనచరణదాసునిగ చేయుదునని విఱ్ఱవీగుచున్నది. అదియుగాక అతిథిపూజ గృహస్థధర్మము కదా ! ఆదరిద్రనారాయణబాలుడు-ఏమ్ము. అదియంతయు నీవే చూడగలవు.

నార:—ఇప్పుడును చూచుచున్నాను ! ముందును చూడగలను !

సత్య:—ఏమంటివి. నారదా !

నార:—అమ్మా ! ఏమియులేదు యిదే వచ్చితి. [సత్య. నిష్క్ర—]
(నిష్క్ర—) (అను. ౩ పాడుచు)



శ్రీ

# భక్తకుచేలనాటకము.

## ప్రథమాంకము—ప్రథమరంగము.

[కుచేలునిగృహసామీప్య ప్రవేశము-కౌశికుఁడు శీఘ్రగమనమునఁబోవుచుండ, ప్రవేశము కరటకశాస్త్రి యెదుటనుండి-కౌశికుని ఆపి]

కరట:—కౌశికా ! మీగురువు కుచేలభాగవతులు ప్రభాసతీర్థము నుండి వచ్చిరా ?

కౌశి:—నిన్ననేవచ్చిరి కరటకశాస్త్రిగారూ ! అచ్చటిమునులందఱును మాగురువుగారిఁ పూజించి యింతవఱ కాపినందున విధిలేక యాగిరి !

కర:—ఏమేమి ? ఆజడదారులందఱు మీకుచేలుని సత్కరించిరిగా ! ఆమునులందఱు నన్ను పరిపరివిధముల దూషించి, నిందించి యామునివాడనుండి తఱిమినను - మీకుచేలుఁడు వారిసత్కారముల సంతోషముతో స్వీకరించెనుగా—

కౌశి:—కరటకశాస్త్రిగారు ! అది వారియపరాధమా ! మీరు శిశుపాల రాజేంద్రునిపురోహితులై - లోకమున శ్రీకృష్ణభక్తిని నాశనమొనరింప బద్ధకంకణులైన మిమ్మామును లెట్లు గౌరవింతురు ? నేను పురాణమునకు వెడలవలయు. శెలవిండు (నిష్క్ర—)

కర:—ఈ గోచిపాతరాయులు గౌరవించిన నేమి ? దూషించిన నేమి

సీ. శ్రీకృష్ణభక్తని ఛేదించి మాయింప
నధిపుఁ డొసంగు భాగ్యంబులుండ
నృపుల భూషింప నన్మెచ్చి రండని సభ
కాహ్వానముల్ వచ్చి యలరుచుండ
ప్రజల నిందింప నారాజవరేణ్యుండు
ప్రేమనిచ్చెడు రాజబిరుదులుండ
శిశుపాలుఁడే హరి శ్రీనాథుఁ డనిచెప్ప
నలరు గౌరవసమర్యాదలుండ
గీ. గెలిసేసెడు నిరుపేదకీర్తిలేల?
ధరకుచేలుఁ డొక్కఁడే నీకు పరమవైరి
వాని శిశుపాలభక్తుఁడై పరగునట్లు
చేయుటే పని—క్రోధమా! చింతయేల?
(నిష్క్రమము - సావేగముగ)

రెండవరంగము - కుచేలునిగృహము.
(పురాణపఠనమునకై సంతయు సమర్పఁబడియుండును.
బ్రాహ్మణులు ప్రవేశించియుందురు.)

కౌశి:—రావలసినవారందఱు వచ్చినట్లేగదా! వామనభట్టుగారు!

వామ:—ఆ! ఆ! కౌశికా! అందఱు వచ్చినారు. పాపావధానులుగారు, దుర్దాంతసోమయాజిగారు, సోమశర్మగారు, మాధవదీక్షితులుగారు, గోవిందశాస్త్రిగారు అంతా వచ్చినట్లే అయినది. కాని, యింకను గంగాభాగీరథీసమానురాలగు అన్నపూర్ణమ్మగారుమాత్రము రాలేదు!

కౌశి:—అయ్యో! ఆమె మనయందఱివలెనా? శుద్ధవేదాంతి! ఆకలిగొన్నబ్రాహ్మణున కన్నమిడకున్నను కన్నులుమూసుకొని జప

మాలత్రిప్పుటకు ప్రారంభించెనా మధ్యాహ్నము మూడు ఘడియలకుకాని లేవడు. ఇక నదికి స్నానమునకువెళ్లినా, ఆసూర్య నమస్కారాలు, ఆభాగీరథీస్తోత్రములు, ఆజపములు సూర్యాస్తమానమగువఱకు యింటపిల్లలయార్పులు ముగియువఱకు ముగియవు! అదే! కరటకశాస్త్రి బావమఱిదియగు దీక్షితుఁడు వచ్చుచున్నాఁడు! [ప్రవేశము - దీక్షితులు]

దీక్షి:—సుందరాక్షిః, సుందరాక్షీ, సుందరాక్షయః! హేయేసుందరాక్షీ, మాసుందరాక్షీ, మీసుందరాక్షయః!

కాశి:—ఏమి! దీక్షితా! యిది యెక్కడి క్రొత్తశబ్దము. ఇది శబ్దమంజరియందు లేదె?

దీక్షి:—శబ్దమంజరియందు లేకున్న వివాహశాస్త్రమున చూడుము!

కాశి:—వివాహశాస్త్రమా! దాని నెవ్వరువ్రాసిరి!

దీక్షి:—ఇకమీఁద వ్రాయవలయు. దానికి కుచేలమామ కర్త - నేను భోక్త —

[ప్రవే: అన్నపూర్ణ - విధవవత్తులబుట్టతో]

వామ:—అదే! అన్నపూర్ణమ్మగారు వచ్చిరి!

కాశి:—అన్నపూర్ణమ్మగారు! తలఁచుకొనువేళకే వచ్చితిరి! మీర మిక్కిలి చిరాయుష్మతులు! పుణ్యాత్మలు!

అన్న:—అయ్యో! నాయనా! నాపుణ్యమునా అడుగునది! ఏమో పెద్దకాలపుముండనుగనుక ఏజపమో యేతపమో చేయుచ 'నారాయణా' యని కాలముగడపుచున్నాను. నామాటకేమి కాని, మీగురువుగారు, కుచేలభాగవతులు! ఆహా! ఏమి యాతనివిద్య! ఏమి యాతనిభక్తి!

కాశి:—అమ్మా! మాగురువుగారువచ్చుట కింకను నాలస్యమగునేమో కొంచెము గోవిందనామస్మరణ కానిత్తురా!

అన్న:—అల్లాగే! నాయనా కొంచ మీమధ్య మాఘస్నానాలుచేసి కొంతురాసినది. కాని—

వేదశాస్త్రాదులను - గోవిందరామ, వేడ్కతో చదివినను - గోవిందా
జాహ్నవీతోయముల - గో - స్నానంబుచేసినను - గో
నిరతోపవాసముల - గో - నియతితోచేసిన - గో
మొనసి జపతపముల - గో - ముక్తి కల్గదుకాని - గో
శ్రీకృష్ణ హరి యంచు - గో - కీర్తింపు డతనిని - గో
కైవల్యప్రాప్తియు - గో - క్షణములో కలుగును - గో
యజ్ఞయాగాదులను - గో - అతిభక్తిచేసినను - గో
తీర్థయాత్రాదులను - గో - తిరిగిసేవించినను - గో
భక్తియుండినకాని - గో - ముక్తికల్గదు మీకు - గో
శ్రీకృష్ణ హరి యంచు - గో - కీర్తింపు డతనిని - గో

కాశి:—అదే! మాగురువుగారు, కుచేలభాగవతులు వచ్చుచున్నారు!

[ప్రవేశము కుచేలుఁడు సుస్నాతుఁడై]

(అనుబంధము. 3)

కుచే:—[అందఱికిని నమస్కరించి - కృష్ణాజినముపై నుపవేశించి - కనులుమూసి]

శ్లో. దేవఃపాయత్వయసివిమలేయామునేమజ్జతీనాం
యాచంతీనాం అనునయపదై ర్వంచింతాన్యంశుకానీ,
లజ్జాలోలై ః అలసవిలసై రున్మిషద్పంచబాణైః
గోపస్త్రీణాం నయనకుసుమైరర్చితః కేశవోనః! ' ॥

కాశికా! నిన్న మనము భాగవతపఠనమున నాపినస్థలము నుండి మఱల ప్రారంభింపుము!

కాశి:—(గ్రంథమును చూచి చదువును.)

శ్లో. 'నాహంవసామివైకుంఠే నయోగీహృదయే రవా!
మద్భక్తాయత్రగాయంతీ తత్రతిష్ఠామి నారదా! ' ॥

కుచే:—సాక్షాత్పరమపురుషుండగు శ్రీకృష్ణుఁడు చెప్పుచున్నాఁడు. నారదునితో! 'ఏమని'? కౌశికా! (కౌశికుఁడు మఱల చదువును) 'ఓ! నారదా! నేను సాక్షాద్వైకుంఠమునందుమాత్ర మున్నానని తలంపకుము! శ్రీ మద్భానుమండలమధ్యభాగంబున విరాజిల్లుచుందునని యు తలంపకుము! సనకసనందన, సనత్సుజాత, సనత్కుమారులహృదయపంకేరుహములయందు నివసించుచున్నాఁనియు తలంపకుము! అయిన, నెచ్చటనుందునని న?'—కౌశికా! (కౌశికుఁడు మఱల చదువును) 'అనన్యథాభావనులై, అనన్యథాచింతనులై, అస్ఖలితభక్తియోగమహావిభూతిచే నాభక్తులు, యెందెందు—యేయేవేళల—యేయేతావుల—స్మరించుచుందురో, ఆయాతావుల సమంచితపీతాంబరధారినై, సురుచిరకౌస్తుభభూషితుండనై, నిరుపమానలక్ష్మీలక్షితవక్షుండనై ప్రకాశించుచుందు!' నని శ్రీ భగవానులు శలవిచ్చియున్నారు! కావున నోపాఠకులారా! భాగవతపురందరులారా! సమస్తసుజ్ఞానద్వైతాద్వైతమార్గములకంటెను, నితరకర్మానుష్ఠానమునకంటెను, యోగరాజ యోగములకంటెను, భక్తియోగమే ఆపుండరీకాక్షుని కరుణామృతమునడయుటకు, బహుసులభమార్గము!

[ప్రవేశము! కరటకశాస్త్రి - 'ఆపండి! ఆపండి!!' యనుచు.]

కర:—ఆపండి! కుచేలుఁడుగారు! ఇంక నీపురాణ మాపండి! అయ్యా ఎన్నిమారులు చెప్పలేదు. మాయింట నీపురాణమువలదని జ్ఞాపకములేదా? ఇది శ్రీశిశుపాలరాజేంద్రునిరాజ్యము! శ్రీకృష్ణుఁడు మారాజేంద్రునకా జన్మవిరోధి!

అన్న:—అయ్యా! కరటకశాస్త్రిగారు యిట్టి హరినామసంస్మరణసమయముననా యభ్యంతరము కల్పించుట?

కర:___ఓపూర్వసువాసినీదేవతా! చాలు నింకూరకుండుము! మగఁడు గతించినంతనే పిట్టపిడుగుల నిప్పుడు మహావేదాంతివైతివి కాఁబోలు!

అన్న:___కరటకశాస్త్రిగారు! మీరెంత ధిక్కరించినను నిక్కంపుహరి భక్తులకు కోపము కలుగదు! భోగప్రదాత యన్నను___

కర:___అమ్మా! చాలు నిఁక నీయుపన్యాసము! నీవెన్నిమారులు నీట మునిఁగిననేమి? ఎన్నిమారులు కన్నులుమూసిననేమి? పట్టుమని పదిరూకలిచ్చినకదా యింట వంటప్రొయ్యి వెలుఁగును! ధనమార్జింపకుండిన పై నుండి వర్షించునా! అమ్మా! నీకేమి కడుపునిండినదానవు! కుమారుఁడు శిశుపాలునొద్ద నుద్యోగముచేసి సంపాదించుచున్నాఁడు! అదియేమిగ్రహచారమో కాని లోకమున స్త్రీల కించుకమంగళసూత్రములు తెగినంతనే త్రాళ్ళుతెగినబెబ్బులు లగుదురు! చాలు నిఁక దయచేయుఁడు! ఈకుచేలుఁ డన్ననో నిరుపేద! కడుపునిండ సంతానము! ఇంటియం దన్ననో కుండలు దొరలాడుచుండును! ఇట్టివానికి వేదాంతము ముదిరెనగతియేమి! ఇంచుక న్యాయమో, అన్యాయమో యొనర్చుటో, ప్రభువుగారి నాశ్రయించుటో కర్తవ్యమగుగాక! కుచేలా! యిటురమ్ము! ఏమో బీదవాఁడవనియు, విద్యావంతుఁడవనియు, మాయింట నివసింప తావొసంగితి! రమ్ము! ఎట్లైనను ప్రభుసన్మానము లభించునట్లుచేతును!

కుచే:___సోదరా! నాప్రభువు నాశ్రయించుటయే నాకు తెలియకున్నది! అట్టి నే నితరుల నాశ్రయింపఁగలనా!

కర:___ఏమీ! నీకును ప్రభువుకలఁడా?

కుచే:___ప్రభువు - దాత - తండ్రి - గురుఁడు.

కర:___ఎవరాప్రభువు?

మ. హరియే! నాకు ప్రభుండు శ్రీహరియె మన్నాథుండు గోవిందుఁడే
పరమాత్మీయుఁడు బాంధవుండు హరి శ్రీపద్మాక్షుఁడే రాజు
శ్రీ తరుణీవల్లభుఁడే మదాశ్రయమహోదారుఁడు శ్రీకృష్ణుఁడే
ధరణిన్ తల్లియు! తండ్రియున్ సఖుఁడు నాదైవంబు విప్రోత్తమా!

కర:—బాగున్నది! నిన్నగాక మొన్న ద్వారకయందు వెలసినగొల్ల వానినా మనము-బ్రాహ్మణులము దైవమని భావించుట! అట్టి వాఁడా ధనధాన్యముల నిచ్చుప్రభువు! చాలుచాలు ఈ శ్రీకృష్ణస్తోత్రములు మాని మాశిశుపాలస్తోత్రములు చేయుము! నీకు సకలార్థములు సిద్ధించును!

కుచే:—సోదరా! సకలజగములు లెవ్వాని నాశ్రయించునో, తన్నాశ్రయించినవారల నితరుల నాశ్రయింపకుండ నెవ్వాఁడు చేయునో, అట్టి జగదారాధ్యుని, సర్వలోకవంద్యుని, గోవిందుని, ముకుందు నాశ్రయించినవారు మఱి యితరుల నాశ్రయింతురా?

కర:—అయ్యా! నీవు సాందీపముని చెంత సర్వశాస్త్రముల నభ్యసించిన పండితుఁడవు! నీకేమని వచింతును? ఎన్నియోసారులు వచించి, వచించి చాలైనది! అటుచూచితే! నీకుమారుఁడు, రాఘవుఁడు ఔషధసేవయేని యెఱుంగక బాధపడుచు నాసన్నమరణుఁడై యున్నవాఁడు! ఇటుచూచితే! నీకుమారు లాకలిబాధచే మలమలమాడుచు, పరమసాధ్వీమణియైన నీసతిని బాధించుచున్న తీరు! ఆరోదనధ్వనులు నీహృదయమున కఱిగింపఁజాలవా! నీవు చదివినవిద్యలకెల్ల నిదియే ప్రతిఫలము కాఁబోలు! అగ్నిహోత్రునిసన్నిధానమున, 'భరింతును! భరింతును!!' అని చేకొన్నయర్ధాంగినీబాధలఁ దీర్పకున్న దోషముకాదా! కావున, నామాట విని—యెందైన నుద్యోగము సంపాదించి— నీవిద్యను విక్రయించి—

కుచే:—సోదరా! సర్వశాస్త్రజ్ఞానమును, సకలనిగమాగమవేదవిజ్ఞానమును, ఆపరాత్పరునిచేరుటకు సాధనములగుగాక, తుచ్ఛతరమగు నీకడుపు నించుకొనుటకై విక్రయింపనగునా?

కర:—అయిన తిండిలేక నిష్ఠే మాడి చావవలసినదేనా?

కుచే:—సోదరా! ఆకలి నణంప స్వచ్ఛందముగ వైన మొసంగిన వాయువు చాలదా! నదులయందలి పోసిలిసిరు చాలదా! తుద కయాచితముగ నెల్లవేళల, నెల్లతావుల ప్రసరించు వాయువు చాలదా!

కర:—ఇట్టి నిక్కులు నిక్కనవారి నెందఱనో యెఱుంగుదును! ఇపుడు కడుపార తినుట కన్నములేకున్నను, తలదాచుకొనుటకు కని కరించి నేనొసంగిన నాగృహమైన నున్నది! రేపు రాజాజ్ఞచే నదియులేకున్న—?

కుచే:—అడవులవసింతుము! సోదరా! పురాకృతమును తప్పింప నేరితరము? [గానె-అనుబంధము ౭ లోని చరణము] ఓహో! నారదమహామునీంద్రుఁడు వచ్చుచున్నట్లున్నది!

(ప్రవేశము నారదుఁడు! అనుబంధము ౭]

కుచే:—మునీంద్రా! అభివాదనములు! విచ్చేయుఁడు! ధన్యుఁడనైతి!

నార:—నందనందనానుగ్రహప్రాప్తిరస్తు!

కర—.నారదసంయమీంద్రా! శిశుపాలరాజేంద్రునియాస్థానపురోహితులును, కుచేలుని కనికరించి తనయింట నివసింప తావొసంగిన దయార్ద్రహృదయులును నగు కరటకసోమయాజిగారు నమస్కరించుచున్నారు!

నార:—కల్యాణమస్తు! కుచేలా! నీభక్తి యెంతయు ప్రశంసనీయమే! కాని, యింట నందఱును నాహారములేక తల్లడిల్లుచుండ, నీక పురాణకాలక్షేపము భావ్యమా!

4

కర:—అడుగవలసినప్రశ్న ! మునీంద్రా ! మఱల నడుగుడు !

కుచే:—తాపసచంద్రమా ! సర్వధర్మవేత్తలగు తామే యిట్లు శల విచ్చినచో, అకించనుఁడనగు నే నేమనువాఁడ ! ఉదరంభరణ మునకై నాయోపినంత కష్టించుచునే యున్నాఁడకదా !

నార:—మిక్కిలి సంతసము ! అయిన నెట్లు ? నీపాండిత్యమును విక్రయించియా ?

కుచే:—కాదుకాదు ! మునీంద్రా !

నార:—శిశుపాలు నాశ్రయించియా !

కుచే:—హరిహరి ! కాదు ! మహాత్మా !

కర:—అయిన బిచ్చమెత్తియా !

కుచే:—అదియుకాదు సోదరా !

నార:—అయిన నీవృత్తియైన నెయ్యది ?

కుచే:—

సీ. దినము ప్్రాతఃకాలమున స్నానసంధ్యాది
క్రియల నిర్వర్తించి కృష్ణుఁగొలచి
బహుజనాకీర్ణమౌ పత్తనంబును వీడి
ప్రకృతిశోభామయవనములందు
వొక్కరిచే వృద్ధినొందక దైవేచ్ఛ
నలరు నీవారధాన్యముల నరసి
సగపాలు పక్షిసంచయమునకై వీడి
చీమల కొకపాలు ప్రేమవిడిచి

గీ. ధరణిపై తమంతపడినధాన్యములనె
యేరికొనితెచ్చి యతిథుల కిడి కుటుంబ
మెల్ల తనియింపఁజేసెడు నిత్యవృత్తి
యున్నయదికాదె ? భవ్యమౌ యుంఛవృత్తి !

కర:—మునీంద్రా! వింటిరేకదా! యితనిప్రవృత్తిని! ఇట్టివాఁడు వివాహ మేల చేసికొనవలయు? భార్యాపుత్రుల పోషింపలేని యీ వైరాగ్యమున నేమి — యీభక్తిభూషితున కు గృహస్థాశ్రమ మేల? 'కూటికొఱకై కోటివిద్య' లనుట మఱచి, తాను మాడు చుండుటయేగాక, తనపై నాధారపడియున్న కుటుంబమును నండఱిని మాడ్చుచున్నాఁడు! ఇదియే తనభక్తికి ప్రతిఫలము కాఁబోలు! కుచేలా! అయిన నీయిష్టము! పుణ్యమునకుపోయిన పాప మెదురువచ్చెనన్నట్లు, యేమో బీదవాఁడవని కనికరించి నాగృహమున నివసింప నీకింత తావొసంగినది నాదే యప రాధము! నీనుండి మహారాజువలన నాకు సైతము ముప్పు రాఁగలదు! నీయట్టి నిర్ధనుఁడు—

కుచే:—బ్రాహ్మణోత్తమా! ఎంతవ్రయమొనర్చినను తఱుఁగనిధనము నాచెంతనేయుండగా నేను నిర్ధనుఁడ నగుదునా?

కర:—ఏమీ! నీచెంత ధనమువేరున్నదా? ఎంతయున్న దాధనము? ఎందు దాచితివి!

కుచే:—సోదరా! భార్యాపుత్రులకైనఁజూపక యుంచినధనమును నే నెందైన దాతునా! అది యొకక్షణమైన బాయక నెల్లప్పుడును నాచెంతనే యుండును!

కర:—భళి! భళి! యిపుడు బుద్ధిమంతుఁడవు! ఏదీ! ఏదీ! ఎందున్న దాధనము! అన్నియు వరహాలేనా! లేక - ఆధనము—

కుచే:—నాధనము (ఉత్తరీయమునందలి మూటవిప్పుచు)

సీ. చోరులకరమున చొరకుండు ధనము పా
పములెల్ల హరియించు భవ్యధనము
ధనుల భిక్షులచేయుధనము తానెంతవ్ర
యమొనర్చిన తఱుఁగ కలరు ధనము

మానసేంద్రియముల బంధించుధనము మా
శ్రీహరిశిరమున చెలంగు ధనము
యోగులు జ్ఞానులు యోచించుధనము శ్రీ
మోక్షకన్యక బిల్చు మోదధనము
గీ. సత్యధనము నిత్యధనము సర్వసాధ
నము నభీష్టధనము పరిణామధనము
భవ్య శ్రీహరిపాదసేవానులబ్ధ
ధనము శ్రీతులసిదళాభిధాన ధనము !

కర:—(తన చేతికొసంగిన తులసిని విసరి పారవేయుచు) ఇదియా ! నీ ధనము ! మూర్ఖా ! అవివేకీ ! తులసియా నీధనము ! కానిమ్ము! నీమూర్ఖ్యమునకు తగినప్రాయశ్చిత్తముకలిగిన నది నాదోసము కాదు ! కృష్ణుండంట ! భక్తియంట ! శిశుపాలరాజేంద్రు నాజ్ఞయైనచో నీభక్తి, గిక్తి యెంతవఱ కుండఁగలదో తెలియును లెమ్ము [నిష్క్రి - సకోపముగ]

నార:—కుచేలా ! ఈబ్రాహ్మణుఁడు శిశుపాలు నాశ్రితుఁడు ! పురోహితుఁడు ! శిశుపాలుఁడో శ్రీకృష్ణున కాజన్మవిరోధి ! ఇట్టియెడ నీవితనికి కోపపాత్రుఁడగుట యాపదల చేరఁబిల్చుట సుమా !

కుచే:—మునీంద్రా ! శిక్షించుటకును, రక్షించుటకును, మానవుఁడు కర్తయా ?

నార:—సమంజసము ! నీకు దృఢభక్తివిశ్వాసములు కలవు ! సమ్మతింతును ! ఆకలిదప్పులు నిన్ను బాధింపవు ! అంగీకరింతును ! కాని, నీపై నాధారపడియున్న నీకుటుంబమున నందఱికిని నిట్టి దృఢచిత్తములే యుండునా !

కుచే:—మునీంద్రా ! వారిపురాకృతమున కేనుత్తరవాదినా !

నార:—(స్వగ) భళి, కుచేలా ! నీవే ధన్యుఁడవు ! ఆహా ! యిట్టిదృఢ భక్తుల కావాసుదేవమూర్తి యేల కష్టపరంపరలఁ గూర్చుచుం డెనోకదా ! ఇఁక దైవము భక్తపరాధీనుఁడనుట యసత్యమా ?

[ప్రవేశము ! రాఘవుఁడు తూలుచు, వెంట వామాక్షి వారించుచు]

రాఘు:—

మ. జనకా ! చాల ! సహింపఁజాల- యసవుల్ స్థానంబులన్ వీడె నె
మ్మన మత్యంత మచేతనంబయె చెవుల్ మాంద్యస్థితిన్ గూడె నా
కనులా పచ్చగనయ్యె మాట లవిసెన్ కంఠంబు పైగప్పె భా
వన తప్పెన్ వనజాక్షుపై ! నకట ! నన్ పాలింపవే ! పెంపవే !

[పాదముల చెంతఁబడిన కుమారుని కుచేలు డూరడించు చుండఁగ,
వామాక్షియు చెంత నుపవేశించి]

వామా:—కుమారా ! రాఘవా ! ఊరక నీతండ్రి నిట్లు బాధించుట భావ్యమా !

రాఘు:—జనకా ఆకలి-సహింపఁజాల! నీవు కరుణింపకున్న బ్రదుకఁజాల !

వామా:—కుమారా ! యిపుడే యుంఛవృత్తికై వెడలనున్నారుకదా ! దైవ మీనాడు కరుణించిన నొక్కయామమునకన్న నెక్కుడాలస్యముకాదు !

రాఘు:—నోట - తడియారుచున్నది—జనకా ! సహింపఁజాల !

కుచే:—

చ. అలసితి వెంతయో తనయ ! అన్నములేమి త్వదీయభక్తివి
ద్యలకయి సంతసింతునొ ? మదాత్మజుఁడై జనియించినట్టి దు
ష్ఫలమున తిండిలేక కడుబాల్యమునందె కృశించి చావగా
వలసిన నీదు దుర్విధికి వందురి పొక్కుదునా ? మనంబునన్ !

వామా:—అక్కటా ! ఆకలిబాధనైన సైపనగుఁగాక, కన్నకుమారుఁ డాకలిబాధచే కన్నులయెదుట మఢయుచున్నను, విధిలేక,

కనులార పరికించి యూరకుండవలసిన తల్లిదండ్రులసంతాప మూహింపనగునా ?

నార:—(స్వగ) పరమపురుషా ! వాసుదేవా! యిదియా నీయుద్దేశము! ఈ కుచేలున కింకను దారపుత్రాద్యభిమానము సంపూర్ణముగ బాయకుండుట చూచియే యింకను పరీక్షించుచున్నాఁడవా ! ఆహా ! యేమి యీసంతాపకరరంగము ! ఇందెవ్వరిదృఢచిత్తముల పరిశంసింతు ! కాని విప్రుకుచేలునికి యాత్మావబోధకలిగింప నాకర్తవ్యము నే చేసెద ! (ప్రకా) కుచేలా ! యిదియా నీభక్తి ? యింతనఱ శేమేమో వేదాంతమును బోధించితివే! ఇపు డీపుత్రునియాకలిబాధకు తాళలేనివాఁడవు 'కృష్ణా' యని కన్నులుమూసికొనక శిశుపాలు నాశ్రయింపరాదా?

సీ. బహులోకముల నేలు వామనుఁ డాబలి
సార్వభౌముని వేడ చనఁగలేదె ?
ఘనయజ్ఞధనముకై కౌశికమునినేత
యిల హరిశ్చంద్రు యాచింపలేదె ?
గురుదక్షిణార్థమై కోరి యాకౌత్సుండు
యర్థమై రఘురాజు నడుగలేదె ?
ఏకాంగుళినికోరి యేకలవ్యుని ద్రోణుఁ
డెంతో పేరాస ప్రార్థింపలేదె ?

గీ. ఇంద్రుఁ డాకర్ణుకవచంబు వేడలేదె ?
యిలప్రతిగ్రహమే బ్రాహ్మణేంద్రధర్మ
మాను కాదె ? యాశిశుపాలు నాత్మఁ గొల్చి
వేడ మీవంత తొలఁగదే విబుధవర్య !

కుచే:—నిక్కము ! మునీంద్రా ! క్షమింపుఁడు ! చెంత పెన్నిధినిడుకొని పరులపంచ ప్రలాపించుపందమాడ్కి నేపొరపడితి!

కుమారా ! రాఘవా ! ఏదీ ! యిటుచూడుము ! నీవెప్పుడైన నమృత మనుపేరు వినియున్నాఁడవా !

రాఘు:—అమృతమా ? అది దేవతలకుఁగాక మానవులకు లభించునా? దానిచే నాకలిదప్పు లుండవఁటకదా !

కుచే:—ఆకలిదప్పులుమాత్రమేల దానిచే సర్వపాపములు, సర్వరోగములు నశించును ! కావలయునా ?

రాఘు:—ఆహా ! నాకంతపుణ్యమా ! నాకది లభించునా !

కుచే:—లభించు టేమి? మనయింటనే యున్నది !

రాఘు:—మనయింటనా ?

కుచే:—మనయింట ననేల ! మనచెంతనే ?

రాఘు:—మనచెంతనా ! ఏదీ ? ఏదీ ?

కుచే:—ఏదీ ! నీచేతు లిటు మోడ్పుము ! (రాఘవుఁ డట్లొనర్ప) గ్రోలుము ! మనసార గ్రోలుము !

శ్లో. శ్రీవేదామృత మాధిమఃఖనివహోజ్జీవామృతం భామృతం
సంసారోత్తరణామృతం శుకసనందానందసేవ్యామృతం,
వైకుంఠోదధిజాతదివ్యమమృతం భక్తప్రపూర్ణామృతం
లక్ష్మీమానసలక్షితామృత మిదం శ్రీకృష్ణనామామృతం ! ॥

[నారదుఁ డాశీర్వదించుచుండ యవనిక పడును]

---

మూడవరంగము - అరణ్యప్రాంతము.

[ప్రవేశము: మోహిని - సర్వాలంకారభూషితయై.]

(అనుబంధము. ౫)

మోహి:—అదియే యావైపు నీవారధాన్యముల నేఱుచున్న వాఁడే కుచేలుఁడై యుండనోపు ! ఆహా !సముదంచితభక్తిరసమేయవత

రించిపల్లు ప్రకాశించుచున్నాఁడు. ఇట్టి మహాభాగవతశేఖరు నైశ్వర్యలోభమున మోహితునిచేయ కదా నేనిందే తెంచితి! అసత్యాదేవి భక్తుయెడ నింతకార్పణ్యము వహించుట పరమాశ్చర్యము. ఆమెకై నే నీతనియెడ కపటమోహనాటక మాడవలయుఁగదా! కానిమ్ము.

ఉ. సౌరభపుష్పమాల హరిచందనకస్తురి కావలేపముల్
హీరమణీగణంబులును హేమమయాంచితభూషణంబు సిం
గారము జిల్కు జవ్వనిప్రశాంతకటాక్షము నోహటించు
పెక్కు ధీరులు నుందురే? మునులధీరతదాసులు కారె కాంతకున్.

(నిష్క్రి—యవనికనెత్త)

[కుచేలుఁడు ధ్యాననిష్టయందుండ ప్రవేశము. మోహిని - కుచేలుని చూచి, తలపంకించి - మందహాసమున]

మోహి:—ఇతఁడేకదా కుచేలుఁడు! చూచెద నీతని భక్తిధ్యాననిష్ట లెంతవఱకు మదీయగానమాధుర్యమును మీఱఁగలవో?

[అనుబంధము. ౬]

కుచే:—(కన్నులమూసియే) మధురమైనగానము! మధురతరమైన భావము! (కనులతెఱచి) అంతకన్నను మధురతమమైనరూపము!

మోహి:—కుచ్ఛితమైనచేలము! కుచ్ఛితతరమైనభావము! అంతకన్నను కుచ్ఛితతమమైనకార్యము!

కుచే:—కల్యాణీ! నీ కావాసుదేవుఁడు కల్యాణమును చేకూర్చుఁగాక:—

మోహి:—తథాస్తు!—నీవనుగ్రహించిన!

కుచే:—నేను కుచేలుఁడనువాఁడను; నాకు కుచ్ఛితము—

మోహి:—ఆ - ఎవ్వరు - నిన్నె అుంగనివారా? అదియుండనిమ్ము. సరస సంగీతసమాలోలయైయున్న యొక్క విలాసవతి యొంటిపాటున నున్నతటి మాటాడింపఁజెల్లునా?

ఉ. చూడవె చేడెలన్? కనులు శోభిల నెన్నఁడుగాని? యాదలన్
వేడుకనెత్తి యానగొని వీక్షణసేయఁగ పాడియౌనె! యే
బాడబులైన తాజపతపంబులసేయుచొ నన్యకాంతలన్
బ్రోడతనంబునన్ పలుకఁబోయిరె? యియ్యది భక్తిభావమే?

కుచే:—సాధ్వీమణీ! అది నాతప్పుకాదు!

మ. పెనుతాలన్ కఱగించి పన్నగతతిన్ వేన్నృత్యమాడించియున్
తృణముల్ మేయుమృగీవితానములనుద్ధ్వతాక్షిశోభోన్నతిన్
చనగా జేసి శకుంతసంతతికి వాచాళుత్వ మిప్పించు నీ
యనువౌ గానమె ప్రోత్సహించె ననుమాటాడంగ సాధ్వీమణీ!

అందును, భవదీయగానమున శ్రీవాసుదేవమూర్తిని ధ్యానించుటచే నీకును, నాకును బాంధవ్యము కలిగె! కావుననే పలుకరింప సాహసించితి!

మోహి:—ఏమీ! నీకును నాకును బాంధవ్యము కలుగవలయునా! భళి! ఎంత మంచిభగవద్భక్తుఁడవయ్యా నీవు! ఏకాంతమున సరసవిహారలీలాయత్తయైయున్న యొక్క విలాసవతిని, యెక్కడికిని పోవకుండ నిలపి 'గోవిందా!' యనుచు, జపమాలఁద్రిప్పుచు, నెగాదిగపరికించుటయేఁగాక కల్యాణమునుసైతమపేక్షింతువుగా!

కుచే:—సాధ్వీమణీ! వాసుదేవునిభక్తులమగుటచే బాంధవులమంటినికాని వేరుకాదు! ఇఁక కల్యాణమునుకోరుటయన్న, సమస్తజనులకల్యాణమునుకోరుట భాగవతుల స్వభావముకాదా?

మోహి:—ఓహో - జవ్వనియగుసుందరితో కల్యాణమునుకోరుటసైతము భాగవతులస్వభావమా ?

కుచే:—మానినీమణీ ! ఏమంటివి ?—

మోహి:—ఆ - ఏమియులేదు ! నీవు మిగుల ఛాందసుఁడవు ! అయిన, కుచేలా ! అరణ్యమున, వృక్షచ్ఛాయ నిలచి కల్యాణమును కోరిన లభించునా?

కుచే:—కామినీమణీ ! లోకమున భగవద్భక్తులకంతయు శ్రీకృష్ణ మయమేకదా ! అన్నిఁటికిని యావాసుదేవుఁడే కర్త ! ఆగోవిం దుఁడే భోక్త ! ఆహా ! నీయందు, నీప్రతియవయవంబునందును, తుదకు నీప్రతియలంకారమునందును మనోజ్ఞభగవన్మోహన రూపమే కాన్పించుచున్నది కాని, నీవాక్యములందు మాత్రి మావాసుదేవమూర్తి దివ్యమంగళాక్షరములు కాన్పింపకున్నవి కదా యని చింతిల్లుచున్నాఁడ !

మోహి:—(స్వగ) ఆహా ! ఏమి యీమహానుభావుని యస్ఖలితదైవ భక్తి ! నాప్రయత్నమునుమీఱి నాకుసైతము వచింపరాని భక్తిపారవశ్యము కల్పించుచున్నది ! (ప్రకా) బ్రాహ్మ ణోత్తమా ! నీయట్టి వెఱ్ఱిభక్తుల నెందఱినో చూచియున్న దాన ! మీతులసిమాలికలన్నియు, సుందరీజననయనకుసుమ మాలికల కయ్యేకదా యేర్పడినవి ! మీద్వాదశోర్ధ్వపుండ్ర నామములు కామినీజనమనోహరకందర్పలీలాచిహ్నములై కదా రాజిల్లును ! మీనారాయణాష్టాక్షరీమంత్రజపమునకు మదకల మదిరాక్షీ నీవీమోక్షసంసిద్ధియేకదా ఫలము !

సీ. విమలోర్ధ్వపుండ్రనామముల మైధరియించి
కూటసాక్ష్యము చెప్పఁగోరువారు !
తులసిపూసలఁ ద్రిప్పి దొడ్డస్వాము లనంగ
నోరుల కొంపల నార్ప నరయువారు !

హరినామకీర్తనఁ బరులను వంచించి
పొంచి ధన మపహరించువారు
వైరాగ్యబోధకై వచ్చు భామలమాన
ధనము దక్షిణగాఁగ గొనెడువారు

గీ. **మా**టమాత్రంబు హరిభక్తి చాటుచుండ
మనసు కాంతానుసక్తిని మఱుఁగుపఱుప
దానధర్మంబులనుమాని దయను వీడు
భక్తులన లోకవంచనాపరులుకారె?

సుచే:—హరిహరి! కామినీమణీ! అయిన నను క్షమింపుము! నీకింత శ్రమ యొసంగినందులకు నను మన్నింపుము! భగవద్భక్తుల నిందించుటమాత్రము నేసైపఁజాల! అయ్యో! దైవము నీకిట్టి సుందరతరమైనరూపమును ప్రసాదించినందుకు, సుందరతమమైన భగవద్భక్తి నేల ప్రసాదింపఁడయ్యె! సోదరీ! క్షణభంగురములైన సంపదలు సుఖదాయకములని తలఁచితివా! ఎంత తప్పు తలఁచితివి! నిత్యప్రకాశితనిజతత్త్వవిలాసుఁడై, నిత్యనిర్మలచిన్మయనిరుపమానమూర్తియై, నిరంతరమహానందతేజోమండలమండితుఁడై, నిజమయామేయ మహామహిమాంచితుఁడై, మాయాప్రపంచవిదూరుఁడై, లీలామానుషవిగ్రహుఁడైన యాపరాత్పరుని, పుండరీకాక్షుని పూజింపుము! ధ్యానింపుము! అదియే నీకు శాశ్వతసుఖ మొసఁగఁగలదు!

మోహి:—వెఱ్ఱివాఁడా! సమస్తసుఖముల నారాయణుఁ డిచ్చునాఁ సంపదయొసంగుగాక! పోవనిమ్ము! యజ్ఞయాగాదిక్రతువు లొనర్చుటేల? స్వర్గమున రంభాద్యప్సరసలసమాయోగమునకై యేకదా! అట్టిస్వర్గసుఖము తనంతతా నరుదెంచుచుండ, రంభాతరుణిని **మీ**రు సుందరియోర్తు తనయపాంగావలోకనముల నిన్ను కటాక్షింపనుండ వలదందువా! కంటివా సంపద్వై

భవభోగభాగ్యముల ! కనుబఱచెద ! చూడనైనచూడుము. చూచినైన సంతసింపుము ! సంతసించినైన నాయట్టిలతాంగిని వరింపుము !

( మణిహేమధనరాసులచూపును. )

కుచే:—(చిఱునవ్వుతో) అయినదా ! యివియేనా సంపదలు !

మ. తరుణీ ! సంపద లంటి వెవ్వి ? ధనమా ? ధాన్యంబులా ? వస్త్రమా?
కరులా ? కాంచనమా ? యివన్ని మము శోకక్రాంతులఁ జేయునై
శ్వర్యముల్; దీన ముదంబులేదు ! కన నిస్సారంబు లీసంపదల్
హరిపాదాంబుజభక్తిసంపదయె భాగ్యం బిందు బింబాననా !

మోహి:—నీయట్టి వెఱ్ఱిబాపని కివి తుచ్ఛములుకావా ! అయిన నీయట్టి ఛాందసునకు కాముకజనముతో నేమిపని !

కుచే:—కాముకజనమైననేమి ? నిష్కాముకజనమైననేమి ? శ్రీకృష్ణ భక్తులకు సమస్తమును నొక్కటియేకదా !

మోహి:—ఒక్కటియేనా ! నిక్కముగ సమస్తమును నీకొక్కటి యేనా ? సందియములేదుకదా ! అయిన—అన్యకాంతలును— నీకాంతయు నీకొక్కరూపే యగుదురా !

కుచే:—హరిహరి ! కామినీమణీ! నను క్షమింపుము! నాదారినే బోయెద.

మోహి:—(అనుబంధము. 2) [కుచేలు నడ్డగించును]

(ప్రవేశము ! నారదుఁ డించుకదూరమున)

నార:—సత్యభామాదేవిచే పంపఁబడినమోహిని కుచేలు నైశ్వర్య లోభమున ముంచి జయింప ప్రయత్నించుచున్నది ! కర్మఫలి పక్వకాల మరుదెంచినకతన నాయుమ కిందు శుభమే కలుగ గలదు ! నేనిందేయుండి తిలకించెదగాక !

మోహి:—ఆగుమాగుము! కుచేలా! తొలుత మదనశరపీడితనగు నాకు దారిచూపి, పిదప నీదారిని నీవు పొమ్ము!

కుచే:—నిక్కమా! నేచూపినదారి నాశ్రయింతువా! —

మోహి:—తప్పక నాశ్రయించెద! ఏదీ సుఖదాయకమగుదారి!

కుచే:—అయిన గాంచుము! జననమరణరూపసంసారమునకు దూరమగుదారి! ఈషణాత్రయముల బాపుదారి! పునరావృత్తిరహితమగు పురమునుచేర్చుదారి! కలిమికలవారకాంచనేరనిదారి! కలిమిలేనిని గాంచుటకు సులభమగుదారి!

చ. దొరుకనిదారి యెవ్వరును తొంగి కనుంగొన నట్టిదారి బల్
దురితము బాయుదారి యిహదుఃఖము లొందనిదారి సరిస్మృతిన్
సరగనిదారి భాగవతవర్యులు కోరెడుదారి శ్రీహరిన్
దరికొనుభక్తిరూపమగు దారియె నాదగుదారిభామినీ!

మోహి:—ఆదారి పెడదారి! నీయట్టివేషధారులకు లోకవంచనార్థముపయుక్తమగుమాటలదారికాని, నితరసుఖదాయకమగుదారి కాదు!

చ. విరసపుదారి మూర్ఖులగువృద్ధులుకోరెడుదారి సౌఖ్యముల్
పరగనిదారి క్లేశములబాధిలుదారి యువానులెల్ల నా
దరమున కోరరానిపరితాపము గూర్చెడుదారి తిండిలే
కరయ కృశించి మాడి మృతులౌటయె నీదగుదారి! భూసురా!

కుచే:—చేలా! తుదకు నరకయాతల ననుభవించునపుడైన నిన్ను రక్షించుదారి నాశ్రయింపవా!

మోహి:—వెఱ్ఱివాఁడా! అవన్నియు మూర్ఖులవిశ్వాసములు

గీ. కలదొ? లేదొ? తుదకు నరకంబు యెవ్వఁ
డెఱుఁగు? చూచివచ్చినవార లెవరు? చచ్చి

న తరువాత నేమోకల్గు ననుచు నిపుడె
వలచిపైఁ బడుసిరిఁ ద్రోయు పందకలఁడె!

ఐశ్వర్యము నీకు హేయమా! ఔను! ఏలకాదు! నీవును, నీనందనులును, తినుట కన్నములేక, కట్టుట కింతవసనమేనియులేక దినదిన మింతింతమాడి కృశించుచున్నను నీకది కాన్పింపదుకాఁబోలు! ఇదియే గృహస్థధర్మముకాఁబోలు! ఆజన్మము రక్షించెదనని అగ్ని సాక్షిగ ప్రమాణమొనర్చి గైకొన్నయర్ధాంగినిని మలమలమాడ్చు టయే ధర్మముకాఁబోలు! ద్విజకులలలామా! నామాట వినుము! ఈ వేదాంతవచనములన్నియు కాటికి కాలుచాచియున్న మూడుకాళ్ల ముసలులకుగాక నీయట్టివారి కెన్నటికిని నప్పయింపవు! 'కృష్ణ! కృష్ణ!' యని యూరకవాపోవకుము! నీవెంత మొఱవెట్టుకొన్నను, నీకృష్ణుఁడుకాని, నీగోవిందుఁడుకాని మీకష్టములనుండి నిన్నుద్ధరింపఁ జాలరు! కావున నీజపమాలను పరిత్యజించి నీకృష్ణాజిన మావలపార వైచి, నన్ననుసరింపుము! విశ్వసింపు మీయైశ్వర్యమును! నమ్ము మీసంపదను! మదీయతారుణ్యలావణ్య సౌందర్య వారాసినుస్నాతుఁ డవై మన్మథదీక్షవహింపుము! నాసర్వసంపదల నీయధీన మొనర్చెద!

కుచే:—ధిక్కారము! నీయైశ్వర్యమునకు! మగువా! నీవా హరి భక్తులను నిందించుదానవు! నేనా హరిభక్తులను పూజించు వాఁడను! నా కాశ్రీరామభద్రుఁడే తారకము—మదీయనీ ధానము! భాగవతపురందరులే మామకసోదరులు—వైరా గ్యమే పరమైశ్వర్యము—శాంతిదాంతులేపత్నులు. జ్ఞానవివేక భక్తికళలే పుత్రపుత్రికలు! ఆవాసుదేవుఁడే కల్లయందునా! అదే తిలకింపుము—అందు—మార్తాండమండలమధ్యసింహాసన మునన్న యాజగదారాధ్యుని—పరికింపుము! అదే— దిగంతకాంతాక్షీరనదీ కాంతమధ్యవీచికలయందు—సహస్రఫణి ఫణామండిత మహనీయమణి గణకిరణకిమ్మీరిత శేషాహిపర్యంక

ముని — వైనతేయపవమాననందనపవిత్రిఖిరశతపత్రవిరాజన్నిజ చరణనళినవినిస్సరత్ యోఘునీసముత్తుంగతరంగసమ్మేళితనారదాదిమునిముఖవినిసృతస్తోత్రిజేగీయమానదివ్యకల్యాణగాత్రుండై - ఇందిరామేదినీదేవి హస్తవిన్యస్తచామరసమాందోళనరణత్మణి కంకణమంజులమూర్తియై — సకలోపనిషత్సారసమాలోలనిజావతారలీలావిలాసుండై — పరమభాగవతవిరక్తిభక్తిసమాయుక్తసంతుష్టశిరస్తలవిన్యస్తనిజాభయహస్తుండై — ప్రశస్తుండై — రమావినోదియైయున్న యాపరాత్పరుని—దర్శింపుఁడు, పూజింపుము. ధ్యానింపుము. నిర్మలమైన భక్తియోగమే జనులందఱకును పరమభాగ్యము! ఆరమాపతి యనుగ్రహమున యీకుచేలునియందున్న భక్తిదేవతయే నిన్నావరించునుగాక— అనుగ్రహించునుగాక!

[మోహిని పరమభక్తాగ్రేసరయై కుచేలునిపాదములఁబడును.]

(అనుబంధము. ౮)

మోహి:—మహాత్మా! క్షమింపుము. నీయవాఙ్మనసమహిమ నెఱుఁగక కడునపచార మొనర్చితి—

కుచే:—సోదరీ! లెమ్ము. అందఱిని క్షమించుటకును, రక్షించుటకును, నాపుండరీకాక్షుఁడే కర్త! మనమిరువురమును నాపరాత్పరుని ధ్యానింతము!

(అనుబంధము. ౯ నారదుఁడు మందహాసమున తలయూఁచుచుండ నిష్క్రమము.)

(యవనికపడును.)

---

## చతుర్థరంగము.

[వీథి—ప్రవేశము నారదుఁడు—అనుబంధము. ౧౧]

నారః:—మాయాజాలముచే తవిలి, త్రిగుణములచే బాధితులైన పామర జనముఁబోలె నెంచి, కుచేలుని పరీక్షింప సమకట్టినమోహినికి చక్కనియుపదేశమే లభించె! ఆయమ కర్మపరిపక్వముచే నంటియున్న కాలుష్యమును బాసి, భక్తితత్పరయై, యాజగదారాధ్యుని గొలువ వనంబులకు తపంబునకై వెడలె! కాని—సత్యాదేవిమాత్ర మింకను తనపట్టుదల మానలేదు! అయిన కుచేలుని పరీక్షించుటయన్న సామాన్యమా!

చ. నలువ లిఖించినట్టి పరిణామము మాన్పఁగవచ్చు భూధరం
బుల తొలఁగించి భూమిని నభోగతిఁ ద్రిప్పఁగవచ్చు మృత్యువున్
నిలుపఁగవచ్చు వారినిధి నిర్జలమౌనటు చేయవచ్చుగా
కలరె కుచేలుభక్తిపథ మాపఁగ నేరికి నైన శక్యమే!

[లోన - అనుబంధము. ౧౧ లోని చరణము] ఓహో! సాధువులువచ్చుచున్నట్లున్నది! నాకు చూడ వీరు కుచేలుని పరీక్షానాటకమున నాజగన్నాటకసూత్రధారిచే కల్పితపాత్రలని తోఁచెడిని! కానిమ్ము! దీనిచే నాభాగవతశిఖామణి సందియములబాసి లోకమునకు నిరవచ్ఛిన్నభక్తియోగమహామహిమను బోధింపఁగలఁడు! నేనిందే యుండి యీవింతనాటకమున ప్రేక్షకుఁడ నయ్యెదగాక!

[ప్రవేశము! ఇద్దరుసాధులు! అనుబంధము ౧౧]

1. సాధు:—జయవాసుదేవ! జయద్వారకావాస!

2. సాధు:—జయగోవింద! ముకుంద! నందనందన!

[ప్రవేశము ! కుచేలుఁడు - యెదుటనుండి]

కుచే:—సాధుపులారా ! వాసుదేవభక్తాగ్రేసరులారా ! ఇదే కుచేల నాముఁడు నమస్కరించుచున్నాఁడు ! మీదర్శన మారమా నాథునిసందర్శనమేకదా !

1 సాధు:—వాసుదేవానుగ్రహప్రాప్తిరస్తు ! భో ! కుచేల ! తావక ముఖతేజస్సంపదాభవంతంభాగవతశేఖరమితిమన్యే అధికసంతోషనిమగ్నావయం !

కుచే:—భో ! సాధూ ! శ్రీమతాంకుత్రవావసతిః ! కస్మాదాగమనం ! కస్మిన్నివేశః ! కోవాభాగ్యవాన్ భవదీయసమర్చనేన ?

2. సాధు:—భో ! భక్తాగ్రేసర ! మాదృశానాం భిక్షూణాం కుత్రవా నియతవసతిః, బ్రూహి !

1. సాధు:—భో ! గృహస్థచంద్ర ! భిక్షాందేహి ! భిక్షాందేహి !

కుచే:—భో ! తత్ర భవతాం ! భవతాం ! కరుణయామదీయగృహే మామకభిక్షాన్నపరిగ్రహణేనధన్యోహం ! అనుగృహీతోహం! తామిరువురును తప్పక నాగృహంబున కరుదెంచి, యావాసు దేవుఁడొసంగునాతిథ్యమును స్వీకరించి, నను ధన్యునిచేయ వేడువాఁడ!

1. సాధు:—అహో! సంతుష్టావయం ! శ్రీవాసుదేవః పరమోదార భావః త్వయి అనుగృహ్ణాతు ! జయ ! నందనందన !

[అనుబంధము ౧౧] [సాధువులు పాడుచు నిష్క్రమును.]

కుచే:—[సంతసమున వారికి సాష్టాంగప్రణామ మాచరించును. అతఁడు జారవిడిచినధాన్యపుమూటను . శునకమెత్తికొని పోవును] గైకొమ్ము ! (పోవుచున్న శునకమునుఁ జూచుచు— మందహాసమున—మోకరించి) కృష్ణా ! గైకొమ్ము ! సర్వము నీయదియేకాదా ! వెఱ్ఱివాఁడా ! నీవు కనికరించి, ప్రసాదించిన ధాన్యపుమూటను గైకొన నీకంత భీతియేల ! ఇందును చౌర్య

మేనా! మున్ను సోమకాసురునిచంపి వేదముల నపహరించిన
తఱి యలవడినచౌర్యగుణము, గోకులమున గొల్లవారిండ్లలో
వెన్నపాల్మీగడల నపహరించుటను, పదియారువేలగోపికావస్త్రా
పహరణముననను దాసుఁడగు నీకుచేలునిహృదయ మపహరిం
చుటతోడను తృప్తిఁజెందలేదా! నీనైజమది! ఎందుకు మానె
దవు! (ఏదియో జ్ఞాపకమునకువచ్చినవానివలె తటాలున
ఖిన్నుఁడై) ఆ—ఆ కృష్ణా! దేవాధిదేవా? వాసుదేవా!
ఆగుము! ఆగుము! ఇంచుక ఆగుము! అయ్యో! మిత్రమా!
అవి నీవారధాన్యపుగింజలుకాని రుచిరతరపరిపక్వఫలములు
కావే—ఆగుము. (పోఁబోవ)

నార:—[కుచేలునాపుచు] కుచేలా! యిదియేమి? వాసుదేవుఁ డెవరు?
పోవు టెక్కడికి?

కుచే:—మునీంద్రా! నాదేవదేవుఁడు పోవుచున్నాఁడు విడువుఁడు!

నార:—నీదేవదేవుఁ డెవఁడు? ధాన్యపుమూట నపహరించినది శున
కము కాదా?

కుచే:—కాదు - కాదు—నాకూర్మి చెలికాఁడు! నాదేవదేవుఁడు—
నావాసుదేవుఁడు!

నార:—ఏమీ! నీపాలిఁటి కావాసుదేవుఁడు శునకమయ్యెనా!

కుచే:—సందియమేల? ఒక్కశునకమునందేనా?—

మ. నదులన్ నాదములన్ నదీజలములన్ నవ్యాంబుజాతంబులన్
పొదలన్ పర్ణములన్ ఖగంబుల మృగీపోతంబులన్ జంతులన్
మదనాగంబుల సర్వభూతముల పద్మాక్షుండు కృష్ణుండు నె
మ్మది వ్యాపింపఁడె? విష్ణురూప మిదమన్ భవ్యోక్తినాలింపవే!

నార:—అట్లనా! అయిన నీకృష్ణుఁడే నీధాన్యపుమూట నపహరించెఁ
గదా! దానికై నీకేల చింత!

కుచే:—మునీంద్రా ! అదికాదు నాయాశయము !

గీ. పక్వములుకావు వన్యనీవారధాన్య
ములు కడుసుకుమారుండు మామురహరుండు
వాని భుజియించి తానెంత బాధపడునో ?
బొజ్జలోనున్నలోకముల్ పొగలగనునో ?

అయ్యో ! నన్నేల యింతవఱకు కాపితిరి ? నావేణుగోపాలుఁడప్పుడే యగోచరుఁడయ్యెనే ! అక్కటకటా ! అపక్వములైనయీనీవారధాన్యము లారగించిన యాకౌస్తుభభూషణున కెంత బాధకలుగునో కదా ! ఆ—ఆ—కృష్ణా ! మునివరదా ! అదే ! అందున్నాఁడవా ! గైకొమ్మీసంభారముల ! గైకొమ్మీమధురతరమధువును ! స్వీకరింపు మీఫలరాసిని ! అనుగ్రహింపు మీభక్తుని—(నిష్క్రమము)

నార:—ఆహా ! ఏమి యీకుచేలునిభక్తి ! సమస్తభూతములను శ్రీహరిరూపములుగ గాంచుచున్నాఁడు. అక్కటా ! మానసమంతయు శ్రీకృష్ణునియందు యుంచి—

సీ. పడుచు లేచుచు మీదివలువ జారుచునుండ
పరువెత్తుఁ 'శ్రీహరీ పాహి' యనుచు
యెదురైన జంతుల కెఱఁగి చేతులమోడ్చి
నీనుఁడై! ప్రార్థించు తిను మటంచు
నిలచి పెన్నిధిగన్న నిరుపేదకైవడి
ఆకసంబును జూచి యట్టె నవ్వు
తలయూచి యంతలో యెలుఁగెత్తి హా ! యని
యఱచి తాపసిపాపకరణి నేడ్చు

గీ. పిలచు పొరలాడు ధరణిపై పలుకకున్న
బాదుకొనుతల రక్తంబువచ్చుదాక
యెగురు నృత్యంబు సలుపు తానేడ్చు మరల
నడుచు నున్మత్తుభంగి నేమందు నౌర !

అదేపాపము! అయిన—ఆహా! యిదియేమి! మఱల చినవద నుఁడై వచ్చుచున్నాఁడు! [ప్రవేశము! కుచేలుఁడు]

కుచే:—

సీ. తియ్యనిపల్కులఁ దేల్చినసుగ్రీవు
ఘనరాజ్యపదమిచ్చి మనుపలేదె?
పేరాసపాపియై 'నారాయణా' యన్న
కలుషునజామిళు కావలేదె?
అతిబాలుఁడై నిన్ను నుతియించు ధ్రువుని యా
ఘనపదంబు నొసంగి మనుపలేదె?
ఎంగిలిపండుల నిచ్చినశబరికి
యిచ్చమై సాయుజ్య మివ్వలేదె?

గీ. కావు మనిన కాకాసురు కావలేదె?
నౌక నడపినగుహుని దయ నరయలేదె?
నేనొనర్చిన యపరాధ మైననేమి?
కరుణ పాలింపవలదె యో పరమపురుష!

పరమపావనా! పతితపావనా! నేను పరమపాతకి నగుటకతనన నేనొసంగుమాతిథ్యమునుమాత్రము స్వీకరింపక యేపోయితివి! హరి శుద్ధభక్తివిహీనుఁడ? నని నీవే త్రోసిపుచ్చిన నన్నిక దరిజేర్చి యాద రించువా రెవరు? కృష్ణా! శరణాగతభరణా! ఎన్నిపాపములున్న నేమి? ఎన్ని దుర్వారపాపకదంబములున్న నేమి? శృతిశిరోలంకరణ ములై, భవాబ్ధిసంతరణములై, యఖండ కైవల్య పదవీవశంకరణమ లైన నీచరణనళినముల నాశ్రయించినాఁడ! దీనముగ వేడెదనాఁడ!

శ్లో॥ హే! పద్మేక్షణ! హేదయాజలనిధే! హేవేదవిద్యాప్రభో!
హే! దీనావన! హేముకుందవరదా! హేభక్తకల్పద్రుమా!
హే! గోపాలక! హేసురార్చితపదా! ఆర్తార్తినిర్వాపణా! ॥

హే ! భక్తావన ! హే ! యశోదతనయా ! మాంపాహిలోకేశ్వరా !

[పడుచు - లేచుచు - నిష్క్రమించును]

నార:—ఔరా? ఏమి యీతనియస్ఖలితదైవభక్తి. ఇంట నందఱు నాకటమాడుచున్నను నతిథుల నాతిథ్యమునకై యాహ్వాన మొనర్చినను, మనమున నీతని కాచింతయే లేదు ! ఇదియేమి ! మఱల సంతోషవదనుఁడై యిటు వచ్చుచున్నాఁడు !

[ప్రవేశము ! కుచేలుఁడు - సంతసమున]

కుచే:—మునీంద్రా ! మునీంద్రా ! ఆవాసుదేవునికృపామహిమయెట్టిదో గాంచితిరా ! శేషించినఫలాదులసైతము స్వయముగ తానే నా హస్తమునుండి గ్రహించి నను ధన్యునిఁజేసెను !

నార:—ఏమీ ! శ్రీకృష్ణమూర్తియే యిచ్చటికి వచ్చెనా !

కుచే:—ఔను ! ఆనందనందనుఁడే స్వయముగ నేతెంచి, నాయాతిథ్య మును స్వీకరించి, నను ధన్యునిచేసెను !

నార:—నీవిప్పుడేకదా యిందుండి వెడలినది ! ఇంతలో ద్వారకలో నున్న శ్రీకృష్ణమూర్తి యిచ్చటి కెప్పు డేతెంచెను? నేను చూడనేలేదే?

కుచే:—మీరు చూడనేలేదా ! ఇప్పుడే ధేనురూపమునవచ్చి యుం డెనే?

నార:—నీధాన్యమును గోవు స్వీకరించెనా ! నీకింకను యీపిచ్చివదలి నట్లులేదు ! అదియుండనిమ్ము ! అతిథుల నాతిథ్యమున కామంత్రణ మొనర్చితివికదా ! ఉన్నధాన్యముల శ్రీకృష్ణుఁడని శునకమున కును గోవునకును పెట్టితివి ! ఇఁక రాఘవునిగతి?

కుచే:—ఆనందనందనుఁడు !

నార:—ఆకలిచే మాడుచున్న పసిపాపలుకు దిక్కు?

కుచే:—ఆవేణుగోపాలుఁడు !

నార:—అతిథులభోజనమునకు దారి !

కుచే:—ఆగోవిందుఁడే సమకూర్పఁగలఁడు !

నార:—కుచేలా ! నిన్నేమందును ! నేను సర్వసంగపరిత్యాగియగు సన్న్యాసిని ! నిస్సంగుఁడను ! అయినను నీకుటుంబమున లేని చింత నేనాపాదించుకొనుచుండ, నీవు గృహస్థుఁడవై, యొక కుటుంబము నీపై నాధారపడియుండ నిస్సంగుఁడవై యున్నాఁడవు !

కుచే:—మునీంద్రా ! అతిథు లానందనందనుని స్వరూపులే కదా ! ఆదేవదేవునిస్వరూపులగు నతిథుల కాదేవదేవుఁడే సమకూర్పఁగలఁడు ! నాకేల చింత ! రండు ! ఆనందనందనునిధ్యానింతము ! (అనుబంధము ౧.౨)

(నిష్క్రమణము)





శ్రీ

# భక్తకుచేలనాటకము.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము - కుచేలునిగృహము.

[ప్రవేశము ! వామాక్షి ! ఉతికినవస్త్రములు భుజమునను - నీటితోనున్న మట్టిబిందెతో - వెంట బాలబాలికలు వచ్చుచుండ!]

(అనుబంధము. ౧౩ )

వామా:—కుమారులారా ! ఇంచుక తాళుఁడు ! అందుపవేశించి పాఠముల చదువుచుండుఁడు !

1. బాల:—అమ్మా! ఆకలియగుచున్నది! నిన్న తెల్లవారినుండి మాకేమియులేదు—

2. బాల:—అమ్మా ! మాయన్న రాఘవుఁడేల పరుండియున్నాఁడు!

వామా:—తనయా! ఏమియులేదు పొండు (బాలకులు నిష్క్రమము) అకటా! జగదీశ్వరా! ఇంకను మాపై కరుణకలుగదా ? త్వదేక శరణులమైన మాకు నీవే యిట్టికష్టము లొసంగిన మమ్మిక రక్షించువారెవరు ? అన్నాహారములులేక వాపోవుచు ప్రాణాపాయస్థితియందున్న యాపసిబాలుని—రాఘవుని గాంచి యెట్లూరడిల్లుదు! సమంచితవస్త్రాభరణము లొసంగకున్నను తుద 'కాకలి— యాకలి!!' యని యాక్రందన మొనర్చుపిల్లలకు తల్లినై —పట్టెఁడన్నమైన నివ్వఁజాలకున్నానుకదా ! అనాథ రక్షకా! పరమేశ్వరా! అనేక జీవసంతతి కాహారము కల్పించి

రక్షించు నీవు మమ్ముమాత్రి మేల యుపేక్షించితివి? మేమొన
ర్చిన పాపమైననేమి? నే నమూల్యాంబరభూషణాదులకోరను!
ధనకనకవస్తువాహనాదుల వాంఛింపను — కాని — ఆకలిచే
మాడు పసికూనలకు తల్లినై పట్టెడన్నమైన కోరరాదా?
అకటా! తొలిజన్మమున మేము సంతరించినపాప మెంతకలదో?
దీనదయాపరుండగు నాదైవమునకు సైతము నిర్దయాస్వాంతము
కలిగెగా! అనాథపాలకా! ఈపసిపాపలసంతాపము చూచి
సమస్తభూతసంతానమే వగచుచుండ తల్లినగు నే నెట్లోర్తును?
దీనరక్షకుండను నీబిరు దెందుపోయె? జగతీతలమున మేము
మనరాదో?

ఉ. నీవు దయాపరుండ విఁక నేను దరిద్రవతిన్ జనార్దనా!
నీవు జగత్కుటుంబి విఁక నేను ననేకతనూజమాత దీ
నావనుఁ డీవు నేను కడుపంటుచు 'నన్న మొరామ!' యంచు వా
పోవుచునున్న దీన తలపోయగ నీవును నేను బాంధవుల్
పావన! బ్రోవకున్న మనబంధుత కైన కొఱంతగల్గదే?

[ప్రవేశము! రాఘవుండు! తూలుచు]

రాఘు:—జననీ! ఎందున్నదానవు! నేరాంజాలను—నడువఁజాలను.

వామా:—అయ్యో! కుమారా! ఆహారములేమి, శోషిల్లి మూర్ఛిల్లి పరున్న వాఁడ వేల లేచివచ్చితివి!

రాఘు:—అమ్మా! బంధువులు! ఆప్తబంధువులు వచ్చియున్నారు.

వామా:—అయ్యో! నాయనా! యిదియా నీసంతోషమునకు కారణము? ఇంత నాలుగుదినములనుండి యాహారములేక మీ రందఱు మాడుచుండ బంధువులరాక నీకామోదదాయకమా?

రాఘు:—తల్లీ! వారు సామాన్యబంధువులని తలంచితివా?

ఉ. బాధ మెఱుంగకన్ హరెరమాధవు గొల్చెడిపుణ్యలోకసం
బంధులు జన్మసార్థకతవారక నిచ్చెడిబంధు లెంత ని
ర్బంధ మొనర్చినన్ ధరణిపాపులచేరని కల్మిలేమికిన్
బంధులు మాదుపుణ్యమున వచ్చిరి ధన్యులచేయ నమ్మరో !

వామా:—పోవనిమ్ము ! నాయనా ! వారైన నేరీ !

రాఘు:—పిలచుకొనివత్తునా ! (పోయి సాధువుల తోడ్తెచ్చును.)

వామా:—సాధువులారా ! తాము స్నానాదిక్రియల నిర్వర్తించి, మా యాతిథ్యమును స్వీకరింపవేడుదాన !

1 సాధు:—సాధ్వీ ! మీయాదరణ కెంతయు సంతసించితిమి ! మేము మాయనుష్ఠానమును నిర్వర్తించివచ్చెదము ! [నిష్క్రి] (అనుబంధము ౧౮)

వామా:—నాయనా ! రాఘువా ! వీరాబంధువులు ! వీరిరాకయా నీ కామోదదాయకము?

రాఘు:—అమ్మా ! మానవునకు నిక్కంపుబాంధవులు వీరే యని మా తండ్రి వచింపఁడా ! తల్లీ ! వీరిరాకచే కలిగినసంతసమున కాఁబోలు నా కాయాసముపై తము కనుపించదయ్యో ! ఇప్పుడేటికో శరీరము వివశమగుచున్నది ! పాదములకు శరీరమును భరించు శక్తి యంతకంతకు తక్కువయగుచున్నది ! నోట—తడి ఆరుచున్నది ! చాల—అమ్మా ! చాల ! మాతండ్రి పురాణము చదువుచో వచించుచున్న మరణావస్థ యిదియే యగునా !

వామా:—అమంగళము శాంతించుఁగాక ! అయ్యో ! కుమారా ! నాల్గుదినములనుండి యాహారములేమిచే నించుక నాయాసము గల్గినమాత్రమున నిట్టిమాటలాడనగునా ! అచిరకాలముననే మీజనకుఁడు నీవారధాన్యములతో రాఁగలఁడు ! అపుడు

కడుపార భుజియింతువఁట లెమ్మి! యిపు డించుక విశ్రాంతి గైకొనిః—

రాఘు:—అమ్మా! విశ్రాంతియా! కానిమ్మి! నాకిక శాశ్వతవిశ్రాంతియే కలుగకలదేమో యెవ్వఁడెఱుఁగు? అమ్మా! ఆవైపు చూడుము! ప్రపంచము చాల సుందరమైనది! తల్లీ! యిట్టి సుందరతరప్రపంచమును, నిన్ను, జనకుని, పసిపాపల నందఱిని వీడి మరణించుట చాల కష్టముసుమా! అయినను, విధిలేదు! ఆపరాత్పరునియాజ్ఞ ప్రనస్త్రిల్లియే తీరవలయుకదా!

వామా:—కుమారా! నీవిఁక యిట్టిమాటలచే బాధించిన నే నింకను సైఁపజాల!

రాఘు:—వలదు - అమ్మా! పోవలదు! నేనిఁక విశేషకాలము బాధింపఁ జాలను లెమ్మి! జననీ! ఆవైపుచూచితివా! అదిగో—

గీ. పెఱిగె యోగనాథుమునుండి భాను కిరణ
ములవె! తలిరాకుపై హిమజలములందు
పసుపు ముత్తెములై దోఁచె! భళి! ముకుందు
మహిమ గాంతునే నేఁపు నోమాత! మఱల!

అమ్మా! మరణించినపిదప నేమగును?

వామా:—అయ్యో! కుమారా! ఏమాటలు మననార నాడితివి తనయా!

సీ. చెలువు రు చెక్కుల నులిమినవాల్గారు
టాననంబున నింకమాన లేదు
వినువారిననియిందు నవువుమూర్త్రుల 'కృష్ణ!
శ్రీహరీ!' యనుచు కీర్తింపలేదు
వేమవే తండ్రి నేర్పినవేదపాఠంబు
నగమైనచదువుట ముగియలేదు

మనసార నాచెంత మాధవుకథలను
విని భక్తిబాష్పముల్ విడువలేదు
గీ. కులము వెలయించి సత్కీర్తి గొలుపలేదు
మమ్ము కనలేదు మమతల మసలలేదు
పదియు మూడవయేటనే మమ్ముబాసి
యకట ! రాఘవా ! మరణింతు వనఁగ నగునె ?

రాఘు:—అమ్మా ! మరచితి. అతిథులభోజనమున కై యేమాలోచించితివి. జనకుఁ డింకను వచ్చుటకు ఆలస్యమగునేమో? పాపము క్షుధార్తులయిన యతిథు లాతిథ్యమున కై తపింపరా?

వామా:—కుమారా ! నేనేమొనర్తును. ఇంట నొకధాన్యపుగింజ యైననున్న కులశేఖరుఁడగు నిన్నిట్లు నాచేతులార మృత్యుదేవత కర్పింతునా? ఇఁక పొరుగింటికిపోయి తుదకు హేయతరమగు దాస్యవృత్తి కైన సమ్మతించి యింతధాన్యమును సేకరించుకొని తెత్తమన్న నిన్నిట్టివేళలో విడిచిపోవగలనా?

రాఘు:—ఇదియా నీసందియము ! అమ్మా ! ఎట్టిపామరమునఁ బడి పోవుచున్నావు. పుత్రవ్యామోహమున నీచేయవలసినధర్మకృత్యమును మానెదవా? తల్లీ ! నీధర్మముతప్ప నీ వీలోకమును వీడునపుడు నీపుత్రికలు వెంటవత్తురా? అమ్మా ! నీకు నేను వచించువాఁడనా? కాని—

ఉ. రా రొకరైన వెంట కనరా రెవరున్ మనలేమి వేళలో
చేరుదు రెల్లవారు సిరిచేరినవేళలొ మృత్యువాతదా
చేరుచో నాస్మశానమునుచేరి తమంతనెపోదు రిండ్లకున్
వారక పాపపుణ్యములె వచ్చును ప్రాణులవెంట నమ్మరో !

వామా:—తనయా ! నీసుజ్ఞానవచనముల కై సంతసింతునా? దుఃఖింతునా? విధిలేదు. పోవనేవలయు. కాని—

రాఘు:—అమ్మా! ఇదియా! నీధైర్యము పోవనిమ్ము. నీవు నాచెంత నుంటివనుకొమ్ము. ఆపరాత్పరుఁడే నా కీదినము అంత్యమే లిఖించియున్న నీవు తప్పింపగలవా?

గీ. మరణమొ సుఖమో కష్టమో ప్రాప్తమేదో
కలుగదేదైన కంజాక్షుకరుణలేక
నంచు మాతనూరట నందియైన సాధు
పూజనముసేయ కడగు మో పూజ్యచరితా!

వామా:—అకటా! లోకమున తమకుమారులు రోగాదులచే బాధ పడుచుండ గాంచి, దుఃఖించుటకైన నోచనితల్లుల నెందైన గంటిమే? తుదకు పక్షిమృగసంతానమునందైన ఎప్పుడైన ఎందైన ఆకలిబాధచే చచ్చుట వింటిమే? ఆకలిబాధచే పేగులుమాడు చుండ విలపించుపుత్రులఁ జూడజాలక — వాపోవుటకైన వీలు లేనిజననయిత్రుల నెందైనగంటిమే? తనయా! నీసంతాపమునకై పోగల్గుదునా? ఇపు డతిథిపూజ కేమియు లేమికై వగతునా? సర్వేశ్వరా! శ్రీకృష్ణా! నీభక్తుల నమ్మెట్టివిషమసంకటములపాలు చేసితివి. ఇదియా! నీభక్తవాత్సల్యము యిదియా! నీశరణాగత రక్షణము. కట్టా దైవము నేల నిందించుచున్నదానను! పరమే శ్వరా! దీనబంధో! నాకుమారుఁడాసన్నమరణుఁడై యున్నాఁడు కదా యనుసంతాపభరంబున నిన్నేమైన ననియున్న క్షమిం పుము! భవదీయస్వరూపులగు నీయతిథుల తనియించుటకంటె మామకనందనుని ప్రాణాపాయస్థితి నాకంత యెక్కుడుకాదు! గోవిందా! ముకుందా! అంతయు నీవే! అందఱిని కాపాడు వాఁడవు నీవె! నీవులేకున్న—నీదయారసదృష్టియే లేకున్న నేనిందుండిమాత్ర మేమొనర్పఁగలను. ఇదే! నీస్వరూపులగు నతిథిదేవతల తనియించుటకై దాస్యవృత్తికైన సమ్మతించి పోవు చున్నదాన! మాకతిథిసేవాభాగ్యమును చేకూర్పుము! ఇదే

నీవోసంగిన యీ కుమారుని నీకే యప్పగించిపోవుచున్నదాన! సకలచరాచరవస్తు సంచయములారా! సకలాంతరబాహిరపరిమాణులారా! యమవరుణానిలహుతాశనాదిదేవతా విసరములారా! మీరు—సర్వేశ్వరునిచే సృజింపఁబడి, సతత ధర్మరక్షణ సేయ నియుక్తులైన మీరు—కేవలధర్మానుపాలన మునకై—ధర్మదీక్షాబద్ధనై యేగుచున్న నేను నాకుమారుని మీకప్పగించి పోవుచున్నదాన! నేమఱలివచ్చువఱకీ బాలుని వీడిపోవకుఁడు. మీరే రక్షింపుఁడు—సర్వేశ్వరా!

శా. నీపూజారతి నీజపంబు తపముల్ నీనామసంకీర్తి నీ
రూపధ్యానము చేయుభక్తుని కుమారున్ నీకునర్పించినా
నాపన్నుల్ దయఁబ్రోచెదో? కఠినతన్ యాత్మ్యంబు చేకూర్చెదో?
నాపాపం బది యెంతయున్నదియొ? కృష్ణా! మాధవా! కావవే!

[నిష్క్రమము - యవనిక పడును]

---

రెండవరంగము! కరటకశాస్త్రిగృహము.

[సరోజిని యొకయాసనముపై నుపవేశించి వీణాతంత్రులు సవరించుచుండును
ప్రవేశము దీక్షితుఁడు]

దీక్షి:—అక్కయ్యా! నాపెండ్లివిషయ మీవేళ యేదో యొకటి తేలితీరాలి? ఎప్పుడడిగినా మాబావ కరటకశాస్త్రి, యేదో యొక దొంగసమాధానము చెప్పడమేకాని, మాకుచేలమామ కూతురు సుందరాక్షిని పెండ్లిచేసేమాటే యెత్తఁడు మాట్లాడకు—ఏం!

[ప్రవేశము! కరటకశాస్త్రి కోపమున]

కరట:—ఏమి యీ కుచేలునియౌద్ధత్యము! ఏమి వీనిగర్వము! ఆ! నాబావమఱఁది యగుదీక్షితునకు తనతనయయందు సుంద

రాక్షి నొసంగఁడఁట ! కానిమ్ము ! వీనిగర్వ మణంపకున్న నే కరటకశాస్త్రినా! [సరోజినివైపు వీక్షింప—సరోజిని పాడుట నుపక్రమించును. అనుబంధము. ౧౪] ప్రేయసీ ! సరోజినీ!

సరో:—(మాట్లాడక పాడుచుండును.)

కర:—(చెంతకేగి) సరోజినీ ! సరోజినీ !

సరో:—(వేరొకవైపు తిరుగును.)

కర:—అలికుంతలా! (ఆమె సమక్షమునకుపోయి) దేవీ!

(సరోజిని మఱియొకవైపునకు తిరుగును.)

దీక్షి:—మాట్లాడను! ఈవేళ మా అక్కగారు మాట్లాడరు!

కర:—(సరోజిని సమక్షమున కేతెంచి) ప్రేయసీ ! ప్రేయసీ ! (ఆమె యింకొకవైపునకు తిరుగ, కరము గ్రహించి) దేవీ! దేవీ!

సరో:—అబ్బ ! చేయిపెడుపు ను ! (విడిపించుకొని) మీకరగ్రహణమున కలిగినబాధ నప్పుడప్పుడు జ్ఞాపకముచేయుచునే యుంతువల యును ?

కర:—ఏమీ! మృదులములైన నాకరములచే—

దీక్షి:—ఆహాహా! ఏమిమృదులములు బాబు! పిడకదిమ్మలు!

కర:—దేవీ! నేను పిలుచుచుండ వినిపించుచున్నదా !

సరో:—ఆ వినుపించుచునే యున్నది! నేను షడ్జమస్థాయినిపాడుచుండ తాము సప్తమస్థాన మలంకరించి, వీణాతంత్రులు తెగునట్లుఱ చుచుండ వినిపింపకపోవుటకూడనా ! నా సంగీతాభ్యాసమున కేమో యభ్యంతరము కల్పించితిరికదా! ఇఁక తమఘనకార్య మేమో యానతిండు ! తమపాదదాసి యాలకింప సిద్ధముగా నున్నది !

కర:—అబ్బ! ఎంత కీనిందాగర్భితవాక్యములు! చూడు! సంసా రాంగనవుకదా! ఎప్పుడును సంగీతాభ్యాసముతో కాలము గడపిన నెట్లు?

సరో:—కాలనైన కఱిగించుసంగీతమే మీకు రుచింపదా? అయిన నది నిక్కముగ నాయపరాధమే! సంసారాంగన యెప్పుడును యేమిచేయుచుండవలయు? ప్రాతఃకాలమునుండి సాయంకాలము వఱకు బానిసవలె పనిచేయుచుండవలసినదేనా?

కర:—దేవీ! నేనుమాత్రము నీకు వినోదము వలదంటినా?

సరో:—వలదన్నమాత్రముననే మానుదాననా! అట్టివాఁడవు మూఁడవ వివాహమేలచేసికొంటివి?—

కర:—బుద్ధిలేక—క్షమింపుము! మఱచితి! చూచితివా కుచేలునిగర్వము? తన తమ్ము యగుసుందరాక్షిని మదదీక్షితునకొసంగఁడఁట!

దీక్షి:—కోయి! కోయ్! అన్నియు అబద్ధాలే!

కర:—నిక్కము! మీకు మిక్కిలి మదదీక్షితుఁడు మూర్ఖుఁడట!

సరో:—ఏమీ! ఆబడుగుబాపని కంతగర్వముకలిగెనా! అట్టివాఁడు తనభార్యను వామాక్షి నేల మాయింటికి భిక్షాటనకు పంప వలయు!

కర:—ఏమీ! వామాక్షి భిక్షాటనకు వచ్చెనా!

సరో:—భిక్షమునకు కాకున్న యేదోదాస్యమొనర్చి ధాన్యమునుకొని పోవుటకు!—వామాక్షీ! వామాక్షీ! [ప్రవేశము! వామాక్షి] (అనుబంధము ౧౬) పని అయినదా?

వామా:—అమ్మా! అగుచునే యున్నది!

సరో:— ఏమీ! అగుచునేయున్నదా! ఏమో బీదదానివని కనిక రించి, దాస్యమనునెపమున నీకింతధాన్య మివ్వనున్న నాయట్టి

యుదారస్వభావకు—నాయట్టి—నాథా! ఏమి! మాటలు రావా! —

కర:—ఆ-ఆ—నాయట్టిసాధ్వీశిరోమణికి—నాయట్టి యజమానురాలికి.

సరో—నాయట్టిసాధ్వీశిరోమణికి, యజమానురాలికి, 'అగుచునే—యున్నది!' యనియా నీవొసంగుప్రత్యుత్తరము!

వామా.—అమ్మా! నీవడుగుచున్నదంటినేగాక, నే నింకేమియు నన లేదె?

సరో:—నీబ్రతుకున కింకొకరిననుటకూడనా! ఎంతగయ్యాళివే! ఏమో పుణ్య మాలోచించి నీకింత ధర్మముగ ధాన్యమొసంగ నుండ నన్నే యనదలంచితివా! ఔను—కాలమహిమ! నిన్నేల యనవలయు!

వామా—అమ్మా! అజ్ఞానవశమున నిన్నేమైన ననియున్న క్షమింపుము! ఇంట నతిథు లాతిథ్యమునకై వేకరుచుందురు! నేనింటికి తొందరగ పోవలయు—

సరో:—ఏమీ! తొందరగ నింటికిపోవలయునా! నేనుమాత్రము నీతో పనిలేక సంభాషించుచున్నానని తలంచితివా! ఇంకను నింత ధాన్యమున్నదే యెవ్వరు విసరవలయు?

వామా:—అమ్మా! క్షమింపుము! యింటకుమారుం డొకన్న మర ణుండై యున్నాడు! ఇట్టియెడ—

సరో:—'ఇట్టియెడ అట్టియెడ?' నీవు పనిచేయకున్న, ధాన్య మూరక వచ్చునా? ఇవి కష్టపడి, శ్రమకోర్చి సంపాదించినధాన్యములు కాని, నీమగనివలె క్రిందపడినవాని నేరికొని తెచ్చినవికావు నీవడిగినప్పుడెల్ల దానమొనర్ప!

వామా:—అమ్మా! నేను దానమడుగలేదే! నేనిప్పు డొనర్చిన పనికై, దాస్యమునకై, నాకు రావలసినధాన్య మిమ్మంటినికాని—

సరో:—నీకు రావలసినవా ! పని యసంపూర్తిగ నొనర్చి, మాకిబ్బంది కలిగించినందున—తిట్లు ? ఏమినాథా !

కర:—ఆ - ఔను కావలసినన్ని తిట్లు !

వామా:—అమ్మా ! నానాథుఁ డింటికివచ్చువేళయైనది—అతిథు లొక చోట యాతిథ్యమునకై వేచియుండురు !

కర:—మేము వచించుచుండుట నీకు వినిపించుటలేదా ! నీ కినాడొక గింజయైన నొసంగఁబడదు ! 'అతిథులఁట !' తినుటకు మాకే తిండిలేకున్నను, 'అతిథులఁట !' మంచిమగఁడు ! మంచిభార్య !

వామా:—అమ్మా ! ఇంట కుమారుఁ డాకలిచే యాసన్నమరణుఁడై యున్నాఁడని వచించినను, నాకు న్యాయముగ నేనిప్పు డొనర్చిన పనికై రావలసినధాన్యమునైన నివ్వకుండుట భావ్యమా !

కర:—'భావ్యమా !' శిశుపాలరాజేంద్రుని ప్రధానపురోహితుఁడై మీకు కనికరమున గృహము నొసంగిన కరటకశాస్త్రిగారినే భావ్యమాయని యందువా ! ఇంత యహంకారమా ! ఇంత గర్వమా! ఒకగింజకూడ యివ్వబడదు పొమ్మా !

వామా:—అయ్యా ! దుర్బలుఁడై, క్షణికములైన యైహికసంపదలచే పరివేష్టింపఁబడినమానవుని—శిశుపాలరాజేంద్రు నాశ్రయించిన మీకే యింతగర్వముండ, యజరామరుఁడై—యనంతుఁడై—సృష్టిస్థితిలయకారకుఁడై-యిట్టి శిశుపాలునంతటివారిని పదివేవుర నిజసంకల్పమాత్రమున సృజించి, లయ మొనర్పఁ జాలు నాజగదారాధ్యుని, గోవిందుని—ముకుందు నాశ్రయించినమాకు గర్వముండు టబ్బురమా ! ఏమియు నొసంగవా ! నిక్కమా ! ఇంట కుమారుఁ డాసన్నమరణుఁడై యున్నాఁ డన్నను, అతిథు లాతిథ్యమునకై వచ్చుచున్నారని వేడినను,

ప్రార్థించినను మీకు కనికరముకలుగదా! కానిండు!-ఇంతట లోక మస్తమించునా? ధర్మము నశించునా! దీనదయాళుండగు నా పుండరీకాక్షుండు నేఁడీదుష్టజనగ్రహంగమున మాయమయ్యెనా! ఔను! నిక్కము. హేయమగుదాస్యవృత్తికైన సమ్మతించి ఇమ్మరించినందుకు నేమట నాదే యపరాధము. సర్వలోకశరణ్యుండును సర్వజంతుజాలసంరక్షకుండును నగు నాజగదీశ్వరుండు, ఆః మానము నేతెంచినయతిథుల సత్కారసత్కృతులకై తానే ప్రసాదించెనా! దృఢభక్తి వేడెదుభక్తుల సంతాపమును దీర్చు యాపద్బాంధవుఁడే పోయెనా! నాప్రాణేశుఁ డెంత వచించుచున్నను, అదృఢవిశ్వాసములేక నేనిం దేతెంచి, నా ప్రార్థనలచే మీకు సంతాపముకలిగించినందునకదా యీనిందా వాక్యశూలములు భరించుటకు ననుభవించితి! అమ్మా! నా కేమియు నొసంగఁజాలనైతినని చింతింపకుము! నాకేమియు నొసంగకున్నను దేవుడు వచ్చి శేషించినధాన్యమును విసరెద లెమ్ము! నాకిఁక శలవిమ్ము. నా కార్యము శుభమొసంగుఁ గాక! (పోఁబోవు)

కర:—పొమ్ము! నీకెవ్వరు దిక్కో చూచెద!

వామా:—అయ్యో! నాకా! దిక్కు—

సీ. ఎంతలో మాకీ యాకష్టములు సమకూర్చి
నేయు పరోజని కేదిదిక్కు?
పతి చెరసాలలోఁబడ తదుద్యమముమాని
నిలుచు నమాసాధ్వి కేదిదిక్కు!
దండహతులచే రక్తముకార మఱలని
యిల కమలాదేవి కేదిదిక్కు?

పతిసుతబాంధుల బంధింప శాంతిచే
నోయు కస్తూరిభామ కేదిదిక్కు ?

గీ. సతుల పుత్త్రుల దుర్భరబాధలెల్ల
గాంచి సత్యంబుకై స్వార్థగరిమవీడు
చంద్రమతి జానకీ వీరసతులదిక్కు?
అట్టిశాంతంబు దైవంబు నాకుదిక్కు !

[వామాక్షి - నిష్క్రమణము]





శ్రీ

# భక్తకుచేలనాటకము.

## తృతీయాంకము.

### ప్రథమరంగము—కుచేలునిగృహము.

[రాఘవుఁడు పరుండియుండ - ప్రవేశము నారదుఁడు]

(అనుబంధము. ౧౨)

నార:—(రాఘవుని గాంచుచు—నిట్టూర్పువిడచి) ఆహా! మరణస్థితి యందున్నను యీ బాలకునిముఖభావ మెంత ప్రశాంతమై—గంభీరమై యున్నది? ప్రేమనిండారఁ బిలచుప్రియజనకునికడ కేగుతనయుని మందహాసభాసురసుందరవదనంబుమాడ్కి, సర్వ జంతుజాలమునకు జనకుఁడగు నాసర్వేశ్వరుని చేరఁబోవుచున్న యీ బాలకుని మందహాసమున కేమందును?

సీ. కంజాక్షుభక్తిమై గాంచునేకాని యే
చోద్యవస్తువునైన చూడఁబోడు।
హరినామకీర్తన యట్టె పల్కునెగాని
'బాధ' యంచనియైన పలుకఁబోఁడు!
అరమోడ్చి కనుల నృత్యము సల్పునేగాని
వేడుక నాటల నాడఁబోఁడు!
పలుమారు మాధవు ప్రార్థించునేగాని
కోర్కెల తండ్రిని కోరఁబోఁడు!

గీ. భక్తి నానందపరవశభావమంది
యలరునేకాని ‘ హా! ’ యని యైన ననఁడు!
యడుగఁ డడలఁడు రాఘవుం డౌర! భాగ
వతశిఖామణిగాక తాఁబాలుఁ డగునె?

పరాత్పరా! వాసుదేవా! యిదియు నీ లీలానాటకమునందలి యొకవిచిత్రరంగమే యగునా? లేకున్న—? [ప్రవేశము! వామాక్షి]

వామా:—

చ. దినమణి యభ్రమధ్యమున తేజరిలెన్ గృహసీమధాన్యముల్
కనబడ వేమియున్ దయయు గాంచదు నాపొరుగింటిసాధ్వి పా
వనులతిథుల్ క్షుధార్తులయి వందురుచుండిరి యింట పుత్రుఁడ
న్ననొ మ్మతినందనుండె! యఖిలావన! యోజగదీశ! కావవే!

మునీంద్రా! అభివాదనములు! కన్నతల్లిసైతము దూరీకరించిన యీహతభాగ్యునిచెంత నుపవేశించియుంటిరా! మీదయార్ద్ర భావమున కేమందును?

నార:—సాధ్వీమణీ! ఊరడిల్లుము. లోకమున ధర్మదీక్షాబద్ధులపైననే కదా యాజగదీశ్వరుని పరీక్షాకటాక్షములు ప్రసరించును! నీకుమారునిచెంత నెల్లప్పుడును నావాసుదేవమూర్తియే ప్రకాశించుచుండ నీతనయుఁడు హతభాగ్యుఁ డగునా?

వామా:—మునీంద్రా! ఈదీనులపై నాగోవిందుని కరుణాకటాక్ష మెన్నఁడైన ప్రసరించునా?

రాఘు:—(కనుల తెఱచి, యించుక లేవ ప్రయత్నించుచు) అమ్మా! అమ్మా! వచ్చితివా! మా గోవిందుని చూచితివా?

వామా:—అయ్యో! కుమారా! నాయట్టి నిర్భాగ్యురాలికి వాసుదేవమూర్తి దర్శనమొసంగునా?

రాఘు:—అయ్యో! జననీ! నీవు చూడలేదా? యిప్పుడే మందహాస
మున నాచెంత కరుదెంచి 'కుమారా! ఇక నీ బాధలన్నియు
నచిరకాలమున నేదీర్తు!' నని వచించి యభయహస్త మొసం
గెనే! నీవు చూడలేదా!

నార:—(స్వగతము) ఆహా! ఏమి యీబాలకుని దృఢవిశ్వాసము!
(ప్రకాశము) కుమారా! నీవు కలగాంచితివి కాఁబోలు! ఇక్కడి
కెవ్వరును రాలేదే?

రాఘు:—మునీంద్రా! మిమ్ము నేచూడనైతి! క్షమింపుఁడు. లేవఁజాల.
పరుండియే యభివాదన మొనర్తును. అనుగ్రహించి గైకొనుఁడు.
తాపసచంద్రమా! మరణమన్న నేమి?

నార:—కుమారా! జననమరణములు ప్రాణుల కెందును తప్పవు.

చ. జననమునుండి దేహినిలఛాయవిధంబున వెంట నంటియే
తనరును మృత్యు వెవ్వరికి తప్పదు; జీర్ణము నైనవస్త్ర మొ
ప్పున త్యజియించి క్రొన్వసనమున్ ధరియించెడిమాడ్కి జీవుఁడున్
తనువు తొలంగి యన్యతను దాల్చ మెఱుంగుటె మృత్యువౌగదా!

రాఘు:—అంతియేగదా! జననీ! అయిన నాకై యేలశోకింతువు?
ఎఱింగియెఱింగి నేను చిన్నతనమునుండి యెట్టిపాపముచేయ
లేదనుటకు నీవేసాక్షి! అజ్ఞానవశమున నేనేమైన నొనర్చి
యుంటినా కరుణాసముద్రుఁడగు నాపరాత్పరుఁడు తప్పక
క్షమించును! అట్టిచో, అమ్మా—

వామా:—అయ్యో! కుమారా! నన్నేల తల్లీ యని సంబోధించెదవు?

ఉ. పిల్లల గూటిలో నునిచి ప్రేమచె రెక్కలగప్పి మేతకై
యెల్లెడ సంచరించి తుద కొట్టులా పుల్గు పోలంతి బ్రోచు నీ
తల్లి త్వదీయమృత్యుపరితాపము గాంచియు మిన్నకుండె నం
చల్లమునందు దూరకు మహో! కడుపాపిని నేను తల్లినే!

అనయంబు నీపదధ్యానైకనిష్టచే
కనులబాష్పజలంబు గ్రాలువాఁడు

గీ. పరమభాగవతకుచేలభద్రసుతుఁడు
ఆర్తుఁడ శరణ్యుఁడ గతికుఁ డైనవాఁడు
ఆకట కృశించి మడయుటే యక్కటకట
విధికృతంబొ? నీలీలయొ? వేదవేద్య !

[నారద నిష్క్రమణము.]

రాఘు:—అమ్మా ! మునీంద్రుఁడు వెడలెనా? ఏదీ నీకరము నిమ్మమ్మ. నేనొకటి ప్రార్థింతును. ఇచ్చెదవా !

వామా:—అయ్యో ! తనయా ! ఈహతభాగ్యురాలి కట్టియదృష్టము సైతముున్నదా !

రాఘు:—ఏమియులేదు ! జననీ ! నీకు నేను చెప్పువాఁడనా ! అయినను, కన్నకుమారుని కాహారమిడలేక మృత్యువున కర్పించె నని నాజనకునిపై కనలకుము ! ఒకపురాకృత కర్మానుభవ మును మఱియొకరు తప్పింతురా యనియైన యూరటనందుము ! నాతమ్ముల నూఱడింపుము ! నన్ను మఱచిపొమ్మ ! కాదు, కాదు. ఎప్పుడైన స్మరింపుము. నన్నిఁక వదలుము. మాటాడఁ జాల. అతిథులు - భోజనము - దారి - (కనులుమూయును)

వామా:—ఔరా ! దుర్భరవేదనాయాతమృత్యుముఖముననున్నను యీపసిపాప ధర్మాచరణమునం దెట్టి యాసక్తిని ప్రకటించు చున్నాఁడు. ఔను ! నిక్కము ! లోకమున ధర్మముతప్ప తన యులు, బాంధవులును వెంటవత్తురా ! నే నీపుత్రవ్యామోహ మున మునింగి నాధర్మమును మాను టెంతయు నసమంజసము ! అతిథులు వచ్చువేళయైనది ! పరమపురుషా ! నారాయణా !

శా. ఇంటన్ లేదొకగింజయైన యతిథుల్ హెచ్చేమనున్నారు యే
యింటన్ చిక్కదు ధాన్యమింక మనుజుల్ శ్రీశుండు గోవిందుఁడే
వెంటన్ బాయక బ్రోచు రేడు కరుణన్ వీక్షించునో? లేక ము
క్కంటిన్ బోలుక్షుధార్తసాధువుల క్రుధాకాలాగ్ని కర్పించునో!

పరమేశ్వరా! యథేచ్ఛముగ పర్జన్యు నాశింపక, తమంతటతాము వృద్ధిగాంచు నరణ్య నీవారసస్యములైన మా కీనాఁ డుపకరింపవా! లోకోపకారార్థమై జగతి నుద్భవించి, వర్షాతపముల సహించి, ఫలభారవినమ్రములైన రసాలాదితరువులైన మాయం దీనాఁ డాదరమువహింపవా!

రాఘు:—అమ్మా—తల్లీ—

వామా:—(కుమారునిచెంతకువచ్చి) అక్కటకటా! కుమారా! క్షణక్షణమునకును మాతృప్రాణమునుండి విముక్తుఁడగుచున్నావా! దుర్భరమహావేదన ననుభవించుచుండియు నిన్నిట్టివేదనపాలొనరించిన యీనిర్భాగ్యురాలి నొక్కమాటయైన నాడితివా! తుదకట్టి 'బాధ' యంచనియైన వచించితివా! మా కాయాసము కలిగింపనొల్లక మందహాసమున నంతయు సైతువే! నీకా యిట్టి దుర్మరణావస్థ! నీకా యిట్టి ఘోరవేదనాయుతమరణము! దైవమా! యదృచ్ఛాలాభసంతుష్టినంది భగవద్భక్తిచే కాలము గడుపుచున్నను, మాకట్టిసంతసమైన కలుగనివ్వవా? అక్కటకటా! లోకమున దారిద్ర్యమునకన్న వేరుదుఃఖము లేదనుటకు మా యనుభవమే సాక్షి! [లోన - జయనందనందన! యని] ఆహా! యిదియేమి! మఱల వ్యామోహమున మునుంగుచున్నాను. నందనందనా! గోవిందా! క్షమింపుము! మాకతిథిసత్కారభాగ్యమును చేకూర్పుము! నాకుమారునకు ప్రాణాపాయమే కూర్తువేని యతిథులభోజనము ముగియువఱకైన కాపాడుము!

[ప్రవేశము - సాధువులు.]

1. సాధు:—ఏమమ్మా ! యిదియా మీయతిథిపూజ ! ఆకలిచే మాడు చున్న యతిథుల మాటాడింపక మీపనులను మీరొనర్చుకొను చున్నారా !

వామా:—మహాత్ములారా ! యించుక శాంతింపుఁడు ! నానాథుఁడు వచ్చువేళయైనది !

2. సాధు:—ఇఁక క్షణమైన శాంతింపము ! ఆతిథ్య మిచ్చెదవా లేదా !

1. సాధు:—అంతగతిలేనివారు మమ్మేల భోజనమున కామంత్రణ మొనర్చితిరి !

2. సాధు:—తినుటకు మీకే తిండిలేకున్నను మీకీ బింకమేల ? ఏమి ? ఆతిథ్యమిచ్చెదవా ! శాపమివ్వవలయునా !

వామా:—మహాత్ములారా ! మాపై ననా శాపము !—

మ. దురితాత్ముల్ దొసగుల్ ఘటింప తపసుల్ దోస్సారముల్ లేమి భీ
కరశాపాగ్ని సణంప ధర్మమగు వీకన్ దీనపై నల్గగా
కరుణాదూరతకాదె సత్ఫలితశాఖాక్రాంతసన్మిభవ
త్తరువడ్డం బని గొడ్డటుల్ దునుము చందంబౌను కాదే ధరన్ !

1. సాధు:—ఇంకను జాగుసేయుచున్నావా ! ఇదే గైకొమ్ము శాపము !

[ప్రవేశము ! కుచేలుఁడు ! శీఘ్రయానమున - ధాన్యపుమూట నొక పేటికపై నుంచి]

కుచే:—మహాత్ములారా ! శాంతింపుఁడు ! శాంతింపుఁడు ! కోప ముప సంహరింపుఁడు ! వామా రమ్ము (మోకరించి) సాధువులారా ! ఇంతకాల మెట్లో యోపికపట్టి సైచితిరి ! ఇంక యొకఘటిక కాలముమాత్రము సహించితిరా ! ఆవాసుదేవుఁడే మీకు సముచితాతిథ్యము నొసంగుభాగ్యమును మాకు చేకూర్పఁ గలఁడు !

1. సాధు:—వలద య్యా! నీ యాతిథ్యము! పాపము మీ కే బుభు క్షకు లేనప్పుడు!

కుచే:—అనుగ్రహింపుఁడు! ఈదరిద్రభక్తుఁ డొసఁగుసభక్తికగంగా జలమునేని పరమాదరణమున గ్రహించి నను ధన్యునిచేయ వేఁడువాఁడ!

2. సాధు:—అట్లే కానిమ్ము!

రాఘు:—దాహము—తాపము—బా—ధ

1. సాధు:—అదిగో! యింట మూల్గుధ్వనులు—మేము వినఁజాలము! ఏదీ ఆతిథ్యము!

కుచే:—ఇంచుక శాంతింపుఁడు! (కుమారునిచెంతఁ కేగి) ప్రేయసీ! ఏమి యీయుత్పాతము? కుమారా! రాఘువా! ఎందుకు తండ్రీ బాధపడుచున్నాఁడవు?

రాఘు:—జనకా! నాలుక—శుష్కించుచున్నది. క్షణము కంటె—యెక్కువ—జీవింప-జాల. అతిథులు - భోజనము—

కుచే:—అక్కటకటా! కుమారా! శ్రీకృష్ణుఁడు నిన్నాకలిచే చావ నియోగించెనా! తనయా! పరమేశ్వరధ్యానమున—

1. సాధు:—భిక్ష! భిక్ష! బ్రాహ్మణా! భిక్ష! తియ్యనిమాటలచే మమ్ము హింసించి చంపవలెననుకున్నావా?

కుచే:—సాధువులారా! శాంతింపుఁడు. నాంకుమారుఁడు చావ నున్నాడు—

2. సాధు:—నీకుమారునితో మేముసు చావవలయునా! ఏదీ! భిక్ష!

కుచే:—దేవీ! అదే ఆ పేటికపై నేగొనితెచ్చిన నీవారపుధాన్యపు మూటయున్నది! దానిని గైకొని, పచనమొనర్చి యతిథిదేవ తలతనియింపఁజేయుము!

వామా:—అక్కటకటా ! మరణశయ్యపై నున్న నిజనందనుని కింత యోగిర మివ్వఁజాలకున్నను చెంతనుపవేశించుటకైన నోచ లేదా? నాథా ! వెడలుటకు కాళ్ళాడకున్నవి.

కుచే:—ధర్మసహాయినీ ! నీపుత్రవ్యామోహముచే నావాసుదేవుని మఱతువా !

వామా:—(లేచి) నాథా ! ఆపిడికెడుధాన్యము వీరికి చాలినంతయోగిర మివ్వఁజాలునా?

కుచే:—నేనేమొనర్తును ! దేవీ ! తొలుతనే సేకరించితెచ్చినధాన్యముల నావాసుదేవమూర్తియే స్వయమున నాహస్తమునుండి గ్రహించెను. కిందఁబడిన వానినిమాత్రము యేఱికొని తెచ్చితిని.

వామా:—(పోయిచూడ మూట మాయమగును) నాథా ! యిందెట్టి మూటయునులేదే !

కుచే:—ఏమీ ! ఏమీ ! ఏమూటయులేదా !—

వామా:—ఇందెట్టిమూటయును లేదే !

కుచే:—అక్కటకటా ! అదియు మాయమయ్యెనా ! పరమపురుషా! శ్రీనివాసా!! సకలబ్రహ్మాండములసృజించి క్షణమాత్రమున లయమొనర్పఁజాలు నీ కీచిఱుతమూటను మాయమొనర్చుటనఁగ నెంత? అనంతా నీయనంతమహిమచే నీపాదభక్తుని హింసింప సాగితివా !

మ. పరిశోధింపఁ ధ్రువుండ కాను కలపన్ ప్రహ్లాదుఁడే కాను సం
స్మరణన్ జూడ గజాధిపుండ నిటు నేకానాత్మసంశుద్ధివే
పరికింపన్ బలి కాను చేనుఁడను నేపద్మేక్షణా ! హింసలన్
పరిశోధింపఁగ నెంతవాఁడ ! కరుణన్ పాలింపవే యీశ్వరా !

1. సాధు:—ఓరీ ! వంచకా మాయచేయుచున్నావా ! ఏదీ భిక్ష !

కుచే:—మహాత్ములారా ! క్షమింపుఁడు—శాంతింపుఁడు—

రాఘు:—జనకా—దాహము—తాపము—

కుచే:—(చెంత కేగి) అక్కటకటా! కుమారా! యిహలోకమును బాసిపోవుచున్నాఁడవా! సుకుమారా! నేడు మాకు లేక పోతివా! అయ్యో! తనయా! నీయట్టిసుగుణకదంబమునకు పదియుమూడువత్సరములకన్న నెక్కువయాయువు లిఖింపక పోవుట కాబ్రహ్మకు నేనే మపచారమొనర్చితిని! తనయా! ఏయాటల మనసారనాడితివి? యేయేభోగభాగ్యము లనుభవించితివని మమ్ము వీడిపోవుచున్నావు! అయ్యో! పరమనిర్భాగ్యుఁడగు నాకు జనించినకతనకదా నీకిట్టి ఘోరదుర్మరణావస్థ—

2. సాధు:—భిక్షు! భిక్షు! ప్రాణముపోవున్నది.

కుచే:—(సాధువుల చెంత కేగును.)

రాఘు:—జనకా—రావే—వేదన—

కుచే:—(కుమారునిచెంత కేతెంచును.)

1. సాధు:—ఇదే మే మురిపోసుకొని చచ్చెదము! భిక్షు!

కుచే:—(సాధువుల చెంత మోకరించి) సాధుపుంగవులారా! నాకుమారుఁడు—

2. సాధు:—తెల్లవారగనే నీవెచ్చట దాపురమైతివయ్యా! భిక్షునిచ్చెదవా! లేక చావవలయునా!

రాఘు:—వేదన—జనకా—వేదన—

కుచే:—(కుమారునిచెంత కేగుచుండ.)

1. సాధు:—భిక్షు! కుచేలా! భిక్షు! కుచేలా!

కుచే:—(వారిచెంతకువచ్చి) మహాత్ములారా!

రాఘు:—జనకా!—

కుచే:—(కుమారునిచెంతకువచ్చుచు) తనయా!

సాధు:—కుచేలా !

కుచే:—(నిశ్చేష్టితుఁడై మధ్యబడును.)

సాధు:—ఒక్క—క్షణము—నాచెంత నుపవేశింపఁజాలవా ?

కుచే:—చాలఁడు ! చాలఁడు !! ఉపవేశింపఁజాలఁడు. తనయా ! వీఁడు నీజనకుఁడైనను, కనులార నీసంతాపమును చూచుచుండియు నేమియు చేయఁజాలకున్నాఁడు ! మరణవేళ నొకక్షణమైన నీచెంత నుపవేశించుటకైన నోచకున్నాఁడు. అవిచ్ఛిన్నముగ స్రవించుకన్నీటిధారల తుడుచుకొనుటకైనను నసమర్థుఁడై యున్నాఁడు ! వీనిని తండ్రీ యని సంబోధింపకుము ! వీఁడు నీకు తండ్రికాఁడు ! నీదౌర్భాగ్యవశమున పదియుమూడవ యేటనే నీకు ఘోరహింసారూపమరణమును చేకూర్పజనించిన కఠినకర్ముఁడు ! పశ్చాత్తాపహీనుఁడు—క్రూరకర్ముఁడు ! తనయా ! సత్యస్వరూపియు, సకలజగదభిరాముఁడును నగు నాసర్వేశ్వరుని ధ్యానింపుము ! స్మరింపుము. ఆవాసుదేవుఁడే నీకు తండ్రి. ఆవాసుదేవుఁడే నీకు తల్లి. మమ్ముల మఱచి పొమ్ము. ఆగోవిందుఁడే నీకు దిక్కు ?

1. సాధు:—ఏమయ్యా ! కుచేలా ! నీయేడ్పేనా మాకేమైన నున్నదా? మాకెవ్వరు దిక్కు !

కుచే:—ఆసర్వేశ్వరుఁడు ! మీకు—నాకు—సర్వప్రపంచమునకును ! శేషశయనా ! జగదీశా ! సచ్చిదానందమయుఁడవై సత్కల్యాణిస్వరూపివైన నీయం దిట్టికష్టవేదనహింసాగుణ మెట్లులవడియె ! అదియు నాగ్రహచారముననా ? నీవెన్ని కష్టపరితాపసంవేదనల నీదాసునిముంచినను, ఆకష్టపరిచ్యుతికి మార్గమైన నీవు చూపకున్న మఱియింకెవరు చూపువారు ! మున్ను కరిరాజుఁ బ్రోచునాఁడు ఘనతరహిమానీశీతల మధుమధురదారాసారకరు

ణారసమున ప్రకటింపవా? నిన్నెందును బాయనినిత్యాన పాయని—నిన్నే యధివసించినజానకికి దురంత్యములగు దుర్భర దుఃఖకల్లోలముల చేకూర్చినను, యందే—యాతావునందే—యాక్షణమునందే తద్దుఃఖనివారణ, తత్సంతాపోపశమనమార్గ ముల నీవే చూపవా! నాయందుమాత్ర మేల యిట్టి విషమ పరీక్షఁ బూనితివి! వాసుదేవా! నేను నీయందు, నీవామభాగ మందు, నీవక్షస్థలమందు లేననియా నాకుమాత్ర మిట్టి విషమ పరీక్ష చేకూర్చితివి! నేను నీవక్షస్థలమునందుమాత్రముగాక, నీయందంతటను, నీవు నాయందును నుండమా! పరాత్పరా! నిజగర్భసంజాతు లాకలిచే మాడుచున్నను నది వారి పురాకృత కర్మ యని సహించితి! ప్రకృతము మరణశయ్యపై నున్న నా కులశేఖరుఁడగు రాఘవుని 'నీయిచ్ఛకువచ్చినట్లు చావుపొమ్మ'ని యావల పారవైచితిని! కాని—యతిథులు—నాచే నాహూతు లైన నీస్వరూపులగు నతిథు లాకలిచే మాడి మడయుచుండుట కనులారఁజూచి యెట్లు సహింపఁగలను! కేశవా! నీవిట్లొనర్చిన ధర్మము నేఁడట్టె జగత్ప్రళయముకాదా! కానిమ్ము! ప్రేయసీ! పొమ్ము! నేను నీవారధాన్యపుమూట నుంచినతావునకు పొమ్ము. ఆసర్వేశ్వరధ్యానమున నందు వెదకుము! ఆధాన్య మందైన పడి యుండవలయు! లేకున్న — ఆసర్వేశ్వరుఁడైన యతిథుల పూజకై —యందు ప్రసాదించియుండవలయు! లేకున్న నేఁడు దైవమే లేఁడనుకొనుము! పొమ్ము!

వామా:—(పోయి చూచి—సంతసమున) లభించినది. లభించినది! నాథా! అందఱిభోజనమునకును చాలినంతధాన్యము లభించి నది! నాథా! యిందు కొంత జావకాచి రాఘవునకంఠమున

కుపహారము కల్పింతువా ? పోవుచున్న ప్రాణములు తిరిగివచ్చు నేమో !—

కుచే:—వలదు ! వలదు దేవీ ! అవి మనస్వత్వములుకావు ! వాని నుప యోగప మనకెట్టి యర్హతయులేదు ! అవి యతిథులభోజనము నకై యానర్వేశ్వరుడు ప్రసాదించినవి. తొలుత వానిని పచన మొనర్చి యతిథిదేవతల తనియింపుము. మన రాఘవుడు బ్రతికి యుండుటయే యాముకుందునియభీష్టమైన—అతిథుల భోజనా నంతరమున—నేమైన మిగిలిన—రాఘవునివిషయమై యోచింతు మంటలెమ్మా !

వామా:—పరిపూర్ణ జగత్ప్రాణసమీరదేవా ! సకలప్రాణావనమైన స్వతయమధర్మరాజా ! దీనమై—ధర్మచరణబద్ధమై యేగుచు వేడు నీదీనురాలి మొఱాలించి నేవచ్చువఱ కీబాలుని వీడిపోవ కుండు !

[పోబోవ—ప్రవేశము - యెదుటనుండి కరటకశాస్త్రి]

కరట:—ఆ—ఆ - పాపినీ ! నిలుము ! నిలుము ! ఎవరితాతముల్లె యని యాధాన్యమును స్వీకరించితివి ? నాపేటికయందలి ధాన్యమును దొంగిలించితివా ? ఇంకను యాపేటికయందలి వస్త్రభూష ణాదుల నేమిచేసితివి ? ఓరీ! పిచండిలా! ఓరీ ! దీక్షితా ! ఎవ రచ్చట ? పలుకరేమి ? చౌర్యము—చౌర్యము ! పొండు ? రాజభటులను పిలుచుకొనిరండు !

1. సాధు:—ఏమీ ! చౌర్యమొనర్చి, తచ్చౌర్యసమార్జితతండులము లచే మాకోగిరమిచ్చెదవా ! దురాత్మా ! గైకొమ్ము శాపోదక ముల !

సుచే:—శాంతింపుఁడు. మహాత్ములారా! ఇంచుక శాంతింపుఁడు. బ్రాహ్మణోత్తమా! మీరే యీమాటలాడితిరా? నిక్కమా? ఆవాసుదేవుఁడే మీకీబుద్ధి నొసంగెనా?

ర:—ఏమీ! చౌర్య మొనర్చుకున్న నీవు తెచ్చినధాన్యములే యింత వృద్ధి నందెనని తలఁచితివా!

చే:—కానిమ్ము! ద్విజసత్తమా! అది మీయపరాధముకాదు. గ్రహచారసమయమున సునిశ్చలహేమచ్ఛత్రములన్నియు నొక్కపెట్టున నయోమయభీకరాశనిధారాపంజరములై శిరమున వర్షించుకాదే!

ఘు:—దాహము—వేదన—తాపము.

:—ఆ - ఆ! ఎక్కడిదీ దామూల్గుధ్వని! అదే నీకుమారుఁడు ప్రాణములు పోవక తల్లడిల్లుచున్నాఁడు. మీయట్టి నిర్భాగ్యులకొఱకై యీగృహము నిర్మింపఁబడలేదు? ఊఁ - ఊఁ—లెమ్ము. మా యింటియం దిట్టియమంగళము తొంగిచూడరాదు. వెడలుఁడు వేగమే! ఎంతయో ధనము వెచ్చించి నిర్మింపఁబడిన దీభవనము!

మా:—స్వామీ! యీదినముమాత్రము క్షమింపుఁడు. రేపు తమ యానతి నొప్పున యావాసుదేవుఁ డనుగ్రహించినతావునకు పోయెదము! కుమారుఁ డాసన్నమరణుఁడై యున్నాఁడు. అతిథులాకలిచే మాడుచున్నారు. ఇట్టియెడ—

:—ఇట్టియెడ—అట్టియెడ! నీకుమారునకై యింటనున్నవారందఱును చావవలయునా? ఏమి రాజాధిరాజకుమారుఁడా నీ కొడుకు? ఈదినము నక్షత్రము మంచిదికాదు. కొడుకు మరణశయ్యపై నున్నాఁడఁట! మరణశయ్యపై నున్ననేమి? సాగ్ని

హోత్రచిత్రిపై నున్ననేమి? ఈ వగలేమ్పులు చాలించి యీడ్చి వేయుము బయటికి. వెడలకైతిరా! రాజభటులచే నీడ్పించెద.

వామా:—ఆర్యా! జనకా! ఆపన్నులమగుమమ్ము ఉదారకరుణా హృదయులగు మీరే కరుణ నరసి బ్రోవకున్న నిక బ్రోచువారెవరు! ఇదే చరణములంటి వేడుదాన! మము చల్లనియిల్లము నారయుండు! ఒక్కదినము.

కర:—ఒక్కదినముకాదు. ఒక్కఘడియ—అరఘడియయైన యింటనుండ రాదు—పోయెదరా! లేక యర్ధచంద్రప్రయోగము కావలయునా?

కుచే:—(మోకరించి) వేడువాడ! బ్రాహ్మణోత్తమా! ఒక్కక్షణము అతిథిపూజ ముగియువఱకు—

కర:—మూర్ఖా! పోయెదవా! లేదా! (కాలితో తన్నును)

కుచే:—(క్రిందపడి) కృష్ణా! నందనందనా! యిదియు నీలీలయేనా బ్రాహ్మణోత్తమా! అతిథిపూజ యగువఱకు—

కర:—అతిథిపూజ! అధమా—పొమ్ము (మఱల తన్నును)

కుచే:—(కనులమూసి) ఆనందము—ఆనందము! కృష్ణా! కృష్ణా (కన్నులతెఱచి) ధన్యోస్మి - అనుగృహీతోస్మి! సోదరా నన్నుతన్నినందునకు నాకు చింతలేదు! ఉపకారమే యొనర్చితి కాని, నిరతోపవాసములచే కృశించి, శల్యమాత్రావశిష్ట యున్నకఠినమగు యీ శరీరమును తాకుటచే నీ కెంతబా కలిగెనోకదా!

కర:—బాధ—గీధ—దురాత్మా! వెడలు మిచ్చటినుండి!

కుచే:—వెడలవలయునా—? నిక్కమా? వెడలవలయునా!

కర:—తప్పక—యిప్పుడే—యీ క్షణముననే—

కుచే:—వెడలెద! యిప్పుడే వెడలెద—అతిసంతోషమున వెడలెద! బ్రాహ్మణోత్తమా! మృత్యుముఖముననున్న కుమారునితో— 'ఆకలి ఆకలి' యని యాక్రందనముసేయు పసిపాపలతో— అతిథులతో—యీప్రచండాతపమున — యెచ్చటికో—యా వాసుదేవుఁడనుగ్రహించిన యేతావునకో— యెట్లో— నాగతి కొలంది వెడలెద! దాని కావంతయు చింతింపను. కాని, సోదరా! నీవే యీమాటలాడితివా! ఆవాసుదేవుఁడే నీ కీబుద్ధి నొసంగెనా! కానిమ్ము—

కర:—వాసుదేవుఁ డెవరు! ఇది శిశుపాలరాజేంద్రునిప్రధానపురోహితుఁ డగుకరటకశాస్త్రియాజ్ఞ!

వామా:—ఆపన్న శరణ్యా!

కుచే:—దేవీ! ఆబ్రాహ్మణోత్తము నేల వేడికొందువు? మృత్యుముఖ మునన్నకుమారుని మరణవేదనావాక్యము లింకను వీనుల ప్రతిధ్వనించుచుండ క్షణక్షణమునకును తేజముబాయుచు దుర్భర మరణబాధ ననుభవించుచున్నను మందహాసముబాయని తన యనిమోము కనులకు ప్రత్యక్షముగ గోచరించుచుండ, మృత్యు దేవతాసాన్నిధ్యమున పవిత్రమైన యీపుణ్యస్థానముననిలచియు, కరుణవహింపకున్న యిప్పారుని నీకరుణావాక్యములు మాత్రము కరుణవహింపఁజేయఁగలవా! లెమ్ము! మన పసిపాపలతో డ్తెమ్ము. నేను రాఘవుని. కాదు—అచిరకాలముననే కానున్న రాఘవుని కళేబరము నెత్తుకొనియెద! రమ్ము—

వామా:—నాథా! ఎచ్చటికి?

కుచే:—ఆవాసుదేవుఁ డనుగ్రహించినతావునకు.

వామా:—నాథా! యీప్రచండాతపమున — యీపసిపాపలతో—

కుచే:—చేలా! మరణించువానికి భవ్యతరమందిరములే కావలయునా?

ప్రపంచమున జీవరాసుల కన్నిటికిని మానవనిర్మితగృహముతో కలవా ?

సీ. చిలుకలు కోయిలల్ ఫలముల మెసవుచు
నేనీడ యలరి వసించుచుండు
మండునెండను మాడు పాంథు లేనీడలో
విశ్రాంతి గని వంత వీడుచుంద్రు
కట్టనిగృహములై కడుబీదసాదల
కేనీడ యాశ్రయ మిచ్చుచుండు
తపసిపాపలనుంచి తల్లు లుయ్యాల లూప
నేనీడ హరి సృజియించినాఁడు

గీ. దైవనిర్మితమౌ గళితఖలపీడ
సుఖము లిడుప్రోడ యనదల శుభము జాడ
ఫలము లిడుఱేడ మునివాడ పులుఁగునీడ
చెట్టునీడయే శరణంబు చెలువ ! మనకు.

1. సాధు:—ఓరీ ! మాగతియేమి ? మేమిట్లే చావవలసినదేనా ?

కుచే:— కాదు — కాదు సాధువులారా ! రాఘవునికిదక్క మాయందఱకంఠములు నింకను ప్రాణములు బాయలేదె ? నేనెందున్న—నదియే నాగృహముగ భావించి—నను ధన్యుని చేయుఁడు.

2. సాధు:—అదికాదయ్యా—

నామా:—మహాత్ములారా !

ఉ. మానస మీపదాంబుజసమర్చనయందున నిల్చె దైవమా
మానెను తోడ్పడంగ మము మానక పూర్వపుకర్మ యీడ్చె నెం
దైన చనంగనయ్యె ద్విజు నానతి నాత్మజుఁ డంతమొందె నో
దీనశరణ్యులార ! వినుతించెద నించుకసేపు సైపరే.

రాఘు:—జనకా! గోవిందా—రావే—

కుచే:—కుమారా! రమ్ము! యిదే నీజనకుఁడు నిన్నాగోవిందునకే యర్పించుచున్నాఁడు. నాభుజసీమనుంచియే నిన్నామృత్యుదేవత కర్పించెద! ప్రేయసీ! పసిపాపలతో డెత్తెమ్ము. రాఘువుఁ డిఁక ను న్నాఁడు. కుమారా! నిన్నింతవఱకు పాలించి పెంచినకరము లిప్పుడు కడసారి నోట నీకింత నీరిచ్చుటకైనను యసమర్థములై యున్నవే యని నను దూరకుము. నీదుర్భరమరణవేదనకు తోడు తండ్రినైన నేను, ప్రచండతరమగుమందు నెండనిచ్చి విధాతయిడిన యాయుఃకాలమునైన సంపూర్ణముగ మన నివ్వక నీకు ఘోరహింసారూపమగు నకాల మరణమును చేకూర్చుటయే నీకు నేఁ సర్చెడి యుపచారమని నను ద మము. కనలకుము ! తనయా ! భగవద్భక్తి పారవశ్యనిమీలితనయనేందీవరమై, సదాసముచ్చరద్గోవింద ముచికుందవరప్రసాదాదినావన నామపరిపూరితమై, వాసుదేవ మూర్తి దర్శనసంజాతానంద బాష్పపూరిత కపోలమైన నీవదనాబ్జము నొక్కతూరియైన కనులార గాంచనైతి! నిన్నిపుడు యమసదనమున కంపి, వనములకో—యెచ్చోటికో పోవుచున్నాను. తనయా! నీవును నన్ను వీడిపోవుచున్నాఁడవు. నేనును నిన్ను వీడిపోవుచున్నాఁడ. మనయిరువురికిని సాక్షీభూతమై—యుభయదుస్తర శోకసమాక్రాంతమై—విలపించు నీతల్లి నాతో కలసి నిన్ను చేరఁగలదు లెమ్ము. దేవీ! యిదే మరణోన్ముఖమై, మరణవికారాకారమైన నీతనయుని మోమొకతూరి కన్నులారా పరికింపుము. మఱల చూడఁజాలవుసుమా! నోరార 'రాఘువా!' యని పిలువుము—వలదు. వలదు. కన్నీరుకార్పకుము. రోదింపకుము! నీవింతవఱకు వీని నేహస్తములపాలించి పెంచితివో వానిచేతనే మృత్యువున కందిమ్ము! నేఁడు మన పాల రాఘువుఁడు లేఁడనుకొమ్ము! నేఁడు నిక్కముగ మన

పాల నారాఘవుఁడు లేఁడనుకొమ్ము. (రాఘవు నెత్తుకొని—
పోవుచు—వెంట వామాక్షి వచ్చుచుండ)

సీ. ఏవేళ శ్రీధవు హృత్పద్మము ధ్యానించు
కతన నిన్ కనులారఁ గాంచనైతి!
ఘనభక్తి చనువున్నమై నను చేరకుండుట
యింపార నిను కౌగలింపనైతి
ఫలపుష్పనీవారముల కేనుఁబోవ నీ
శ్రీకృష్ణగాన మాలింపనైతి
ఫలమొ జలమొ కడుపార నీకిచ్చి నే
నొకనాఁడు సంతసం బొందనైతి

గీ. ప్రేమ 'రాఘవా!' యని నిన్ను పిలువనైతి
చెలఁగి భుజసీమనుంచి నిఁక చేతులార
నన్ను విడలేక యమునింటి కనుపనైతి!
చాల కులశేఖరుని నిన్ను గోలుపోతి!

[పోఁబోవ — ప్రవేశ మెదుటనుండి రాజభటులు]

1. రాజ:—ఓరీ! నిలుము! నిలుము. రాజాజ్ఞచే నిను చౌర్యము
నకై బంధించుచున్నాము.

2. రాజ:—ఓరీ! ఆశవము నందు పారవైచిరమ్ము. నీచేతులకు సంకె
లలు తగిలింపవలయు. (బంధించును)

కర:—ఓసీ! నీవిందేల నిలచితివి? పొమ్ము నీపతితో—

1. సాధు:—ఓరీ! మాగతియేమి? యిదే మమ్ములవధించి మాశవము
లపై నడచి నీయిచ్చవచ్చినచోటికిపొమ్ము—(యిరువురిమధ్య
పరుండి)

వామా:—హా! నాథా! మీకా యీ కారాగారబంధములు. (మీాద
వ్రాలును)

1. రాజ:—రమ్ము కారాగారమునకు—(ఈడ్చుచు)

కుచే:—(తదేకదృష్టితో) తీరినది. సంపూర్ణమైనది! ప్రత్యక్షమైనది! కృష్ణా! శ్రీహరీ! సంసారబంధములు చాలక కారాగారబంధములసైతము నీవే నియోగించితివా! ఓహో! (మందహాసమున) ఏమి నీదయ? ఏమి నీభక్తవాత్సల్యము! అయినదా! ఇంకేమైననున్నదా! ఇంకేమైన చేయఁగలవా! (నవ్వుచు) హహ్హాహ్హా! కృష్ణా! నీవింకేమి చేయఁగలవో చూచెద! నీప్రయత్నమంతయు—కృష్ణా! నున్న—కృష్ణా—

సీ. రవికోటికోటి రారంజితమౌ నీదు
మూర్తిపై కన్నులు మొనయుకతన
సర్వేంద్రియంబులు సమసి నీయందె తా
చేతనశూన్యత చెలఁగుకతన
మానసం బటు వృత్తిమాని నీచిన్మయ
కళలోన నెప్పుడు గ్రాలుకతన
నేను నీవాచును నీవు నేనౌచును
నైక్యభావత నెందు నలరుకతన

గీ. కష్టదారిద్ర్యముల నన్ను గాసిచేసి
యెంత హింసించినను నిన్ను నీవె హింస
చేయుచుంటివి! నన్ను హింసింపలేవు!
వ్యర్థ మీయత్న మిఁక మాను పరమపురుష!

హే గంభీరపారావార సుఖశయనా! హే విశ్వామిత్రయాగరక్షణశిరః కంజమంజులాలకమనోజ్ఞమూర్తీ! హే ఫణీశఫణాపర్యంక వీణాకరకమలనారద సామగానసమాలోలా! హే నిగమనిగమాంత వినిర్మలవీధికానిత్య సంచరణనిజపాదలతాంతప్రచారా! హేఉద్ధవాక్రూర నిరతభాగవతనిర్మల శిరోలంకృతనిజభక్తావనహస్తకమలా! హే నిర్వక్రపూర్వగీర్వాణదుర్వహగర్వనిర్వాపణ పర్వదీపిత ఖచక్రభూచక్రచక్రా

యుధా ! హే ఆయుధానీకనిరాయోధనిర్బాధసుబోధసాధుజనసమారాధనసచ్చిదానందమయవిగ్రహా ! హే విగ్రహకాంతాసంక్షుభితహిరణ్యాక్షవిపక్షవక్షోవిక్షోభసమాయత్తనిజదంష్ట్రాకరాళ మహాపోత్రిపవిత్రరూపా ! హేరూపానుసంధానసనకసనందనకర్మందిబృందహృదిందీవరసుందరమందిరామంధరాచలమంథానవహనచణ మహోగ్రతుంగనిజాంగపరిసర్పితపయోనిధానా! హేనిధాననిజప్రణవనినాదవినోదఘనానంద శృతిబృందమరందబిందుసందోహశతానంద విందా[illegible]కమలా ! కమలానాథా ! నీవుండుటయే ని[illegible]వమైన—నిజమాయామేయకల్పితప్రపంచమున నీయతిథులసత్కారసత్కృతులచే నారాధించుభాగ్యమును చేకూర్చుము. అదే ! దేవ ! సర్వేశ్వరుఁడు—సర్వరక్షకుఁడు—సర్వాంతర్యామి—గోకులానందుఁ డతిథులకై సముచితభోజనమును సిద్ధపఱచియేయున్నాఁడు చూచుచు—గైకొమ్ము—లేకున్న—నేఁడు—కృష్ణా—నీవులేవు—ప్రపంచములేదు—ధర్మములేదు — లేదు — భక్తులు లేరు—

[ప్రత్యక్షము శ్రీకృష్ణమూర్తి వివ్యతరభోజనపదార్థములతోనున్న బళ్లెరములతో—అందఱు స్తంభితులగుదురు]

(యవనికపడును.)

---

రెండవరంగము.

(శిశుపాలునిరాజసభాభవనము ప్రవేశము దీక్షితుఁడు, కరటకశాస్త్రియు యిద్దఱు నుండి)

కర:—దీక్షితా ! దీక్షితా ! రమ్ము ! రాజుగారువచ్చువేళయైనది. (దీక్షితుఁడుకనులుమూసి జపమాలత్రిప్పుచుండ) యిదియేమి? యిచ్చటను జపమేనా ?

దీక్షి:—(ఔనని సంజ్ఞయొనర్చును.)

కర:—నీజపమంత్రమైన నెయ్యదిరా ?
దీక్షి:—అష్టాక్షరీమంత్రజపము.
కర:—ఏదీ ! వచింపుము !
దీక్షి:—ఓం—సుం—ద—రా క్ష్యైనమః
కర:—సుందరాక్షి యెవరురా ?
దీక్షి:—సుచేలమామకూతురు.
కర:—మూర్ఖా ! యిదియా నీమంత్రము ? అదే శిశుపాలమహారాజు గారి యాస్థానము. రమ్ము. (నిష్క్రమము)

(యవనికనెత్త శిశుపాలునాస్థానము. మంత్రులతో శిశుపాలుఁడు ప్రవేశించియుండును. ప్రవేశము - కరటకదీక్షితులు)

కర:—విజయోస్తు ! శ్రీశిశుపాలచక్రవర్తీ ! సకలలోకవిశ్రుతకీర్తీ ! వైరిసముదయసమవర్తీ !
శిశు:—పురోహితవర్యా ! ఆపీఠమున నుపవసింపుఁడు. ఆ ! మీ ప్రయత్నము సఫలమేనా !
కర:—భాగ్యము. దేవా ! కర్మభాగమంతయు మీకొఱకే జరుగున ట్లేర్పఱచియున్నాను. జనులందఱు మిమ్మే—ఓం నమో—
దీక్షి:—సుందరాక్ష్యైనమః
కర:—(జనాంతికముగ) కొంపముంచితివి—
శిశు:—బ్రాహ్మణోత్తమా ! ఈతఁ డెవరు ? యిట్లనుచున్నాఁడేల ?
కర:—దేవా ! యీతఁడు నాబావమఱఁది. అపూర్వపండితుఁడు ! శ్రీకృష్ణుని జనులందఱును 'కమలాక్షుఁ' డనియు, 'పుండరీకాక్షుఁ' డనియు ననుచుండ, మహావిద్వాంసుఁడైన మాబావ మఱఁదిగారు జనులందఱు మిమ్ము 'సుందరాక్షా' యని పిలచు నట్లు చేసియున్నాఁడు.
శిశు:—భళి ! భళి ! పండితుఁడన్న నితఁడే !

దీక్షి:—సందియమేల ! అన్నివివాహములును, అన్నిశ్రాద్ధములును, మీకు—మీభార్యకును జరుగున ట్లేర్పఱచియున్నాను.

శిశు:—భళీ ! శాస్త్రిగారూ ! యీపండితుని నాయాస్థానవిద్వాంసునిగా నియమించితినని ముఖ్యమంత్రితో చెప్పుఁడు !

[ప్రవేశము - భటుఁడు]

భట:—దేవా ! భటులు కుచేలుఁడను బ్రాహ్మణుని, దొంగతనమునకై పట్టి తెచ్చియున్నారు !

శిశు:—కొనిరమ్ము లోనికి వారిని—(భటుఁడు నిష్క్రా.)

కర:—రాజేంద్రా ! వీఁడే నేవచించిన మిడిదేనబాపఁడు. వీఁడు నాయింటనుండినది చాలక నావస్తువుల నపహరించి నాకే ద్రోహ మొనర్చెను. వీఁడు నామాట యింతైనను వినక—

దీక్షి:—నాను సుందరాక్షి నివ్వక—

కర:—ఆగోపాలు ననవరతము గొల్చుచుండును.

[ప్రవేశము - కుచేలుఁడు బద్ధుఁడై—అనుబంధము. ౧౮]

శిశు:—కుచేలా ! రమ్ము. నీచేలమునకున్న భావమే నీగుణమునకును కలిగెనా ? కానిమ్ము. నీయపరాధమేమియో యెఱుంగుదువా ?

కుచే:—సంపూర్ణముగ నెఱుంగుదును.

శిశు:—సమంజసము. ఏమని ?

కుచే:—ధరణి జనించుటే మొదటితప్పు. పుట్టినవాఁడు శైశవంబుననే మరణింపకుండుట రెండవతప్పు.

శిశు:—ఇట్లు దారికిరమ్ము. నీవిప్పు డెవ్వరియధికారమున నున్నాఁడవో యెఱుంగుదువా !

కుచే:—ఆ—సర్వలోకేశుని యధికారమున !

శిశు—మిక్కిలి సమంజసము. ఇంతకాలమున కన్నిఁటిని మధించి, శిశు

పాలుఁడే సర్వలోకేశుఁ డనుసమంచితామృతధారను సంపాదించితివా !

కుచే:—ఓ-లోకేశ లోకపాలకశిశుపాలక పశుపాలకత్వధురీణమైన యా యమృతధారకై యేకదా నేనింత శ్రమించుట !

శిశు:—భళి ! ద్విజసత్తమా ఏదీ ! ఆయమృతధార నింత వర్ణింపుము.

కుచే:—

మ. అలబృందావనలోలధార శృతివేద్యంబైన వాగ్ధార శ్రీ
లలనాసేవ్యమనోజ్ఞధార పరిపూర్ణజ్ఞానమౌనీంద్ర ధీ
కలితానంతప్రభాసుధార భవరోగక్లాంతదీనావనోజ్వ
లితానందసుధానుధార 'హరి, కృష్ణాఖ్యంబు' భూపాలకా!

శిశు:—ఆ - ఆ దురాత్మా ! అశేషలోకసమారాధ్యమైన యీశిశుపాలపరదైవతము నవమానించి దక్కుదవని తలంచితివా ?

కుచే:—రాజేంద్రా ! నీ వశేషభువనారాధ్యుఁడ వగుదువు. కాదనను-అయిన నెప్పుడు ?—విమలసుజ్ఞానమయుఁడవై సర్వభూతదయామయుఁడవై, ఆవాసుదేవునిపాదభక్తుఁడ వగుదువో యప్పుడు—

శిశు:—ఆ - ఆ దురాత్మా—ఏమంటివి ?

కుచే:— కాని—యెంతవఱకును దుర్మదక్రోధములచే నీడ్వఁబడి దుర్బలహృదయుఁడవై యుందువో యంతవఱకును జగదారాధ్యుడునుకావు—జగదీశ్వరుఁడును కాఁజాలవు. కేవల పామరుఁ డౌదువు.

శిశు:—బ్రాహ్మణహతకా ! బిగియబట్టుము నీనాలుకను. మూయుము నీయవివేకపేటికను. మానుము మామకజన్మవైరియగు శ్రీ కృష్ణునినామోచ్చారణ మానుము. మానవైతివా శేషించిన నీయాయువుసైతము పరిసమాప్తి నందఁగలదు.

కుచే:—మిక్కిలి సంతోషము. అట్లొనర్చితివేని నాకు పరమమిత్రుండ వగుదువు—

శిశు:—ఏమీ! నిను వధించిన మిత్రుండా?

కుచే:—ఔను - పుత్రవ్యామోహమునం జిక్కి, సంసారసాగరమున తల్లడిల్లుచున్న నాకు, శీఘ్రముగ - ననాయాసముగ, నావాసుదేవుని పాదసీరేజాతసన్నిధిని చేకూర్చితివేని నాకెంతయు హితము చేకూర్చినవాండవగుదువు.

శిశు:—మూర్ఖా! అవివేకీ! క్షణక్షణమునకును నీకాయుఃపరిమితి సమీపించుచుండుట తెలియంగవా!

కుచే:—నిక్కము. ఇదియొక్కటిసత్యమే వచించితివి. కాని, రాజేంద్రా! నాయొక్కనికిమాత్రమేనా! నాకు, ప్రపంచమున జీవరాసుల కన్నింటికిని, నీచెంత నిలిచియున్న యీద్విజసత్తమునకు తుదకు నీకును క్షణక్షణమునకును నాయుఃపరిమితి సమీపించు చుండలేదా?

శిశు:—వలదు - వలదు - ఉన్మత్తాలాపీ! నీవిపుడు నాచే జిక్కితివి. ఇంతకన్న హింసలకు లోనగుదువు సుమా!

కుచే:—శిశుపాలా! నీమాటలకు నాకు నవ్వువచ్చుచున్నది. హింసించుటకుకాని, రక్షించుటకుకాని నీవు కర్తయని తలంచితివా! నన్నేల?—తుదకు నిన్ను నీవు రక్షించుకొనుటస్సైతము ఆవాసుదేవుని కృపామహిమచేతనేకదా!

శిశు:—అధమా! మాటిమాటికిని ఆగొల్లవాని నామోచ్చారణ మానవా? భటులారా! (ప్రవేశము భటులు) యీదురాత్ముని కట్టి—హింసించి—బాధించి— (పట్టుకొందురు.)

కుచే:— (మందహాసమున) రాజేంద్రా! నీచేం జిక్కిన దీశరీరము! అదియు నీయధీనముకాదు. ఒకవేళ నీ వీశరీరమున కేమైన

నొసర్పఁగలిగితివా ? ఆకళేబరమునకు సంతాప ముండదు. నీకును సంతసముండదు. సంతసమే కలుగునందువా ? అనశ్య మీశరీరమును ఛేదింపుము. హింసింపుము. బాధింపుము. సంత సమున నొసంగెద ! ఇట్టి యస్థిపంజరమగు కళేబరము వ్యర్థ మని భావించియుంటిని. అదియే నీకు సంతసము కలిగించునెడ- అంతకన్న నాకు పరమభాగ్యముకలదా ! (శిశుపాలుని చెంత మోకరించును.)

శిశు:—(క్రోసి) ఇంకను నీదుర్మదమును మానవా ! అధమా ! పుత్ర మిత్రకళత్రసహితముగ నీరధి ముంచెద !

కుచే:—మిక్కిలి సంతోషము - అయిన నానీరధి యెట్టిదని భావించితివి ?

చ. జలచరమై నమాధవుని సన్నిధి నీరధి నూర్మహాపియై
యలరు ముకుందుఁ డత్యమృతమందిన నీరధి ఇందిరాసతీ
నిలయముకన్న నీరధి యహీనసుక్షీరధి దివ్యనీరధిన్
నిలపిన శౌరిపాదముల నెల్పినయట్టుల కాదె భూవరా !

శిశు:—చెరసాలనైచి యూవజ్జీవమును హింసించెద !

కుచే:—సంతోషము. అది మా శ్రీకృష్ణజన్మస్థానమేకదా ! అది యెందఱో లోకమాన్యులు మహాత్ములచే నలంకరింపఁబడదా ?

సీ. జన్మదేశోద్ధారసన్నద్ధలోకమా
న్యునిధైర్యవహ్నిప్రాపన మదేది ?
ఆత్మీయరక్షకై యసువులవిడనాడు
మహిజితేంద్రునిస్వర్గమార్గ మేది ?
భరతభూదాస్యంబు బాపు మహాత్ముని
ఆత్మసమర్పణయజ్ఞ మెచట ?
భారతస్వాతంత్ర్యధీరతాలక్ష్మికే
తావు కేళీగృహోద్యానమయ్యె

గీ. చిత్తరంజన లజపతి చిత్రగృహము
సాధుపండితజవహారిసాధగృహము
భావనిగ్రిహము భరతభవ్యగృహము
కాంచ కారాగృహము శుభాగ్రిహముకాదె !

శిశు:—ద్రోహీ ! మానితగదాఘాతసన్నిపాతశాత్రవసంచయుఁ డీశిశు
పాలుఁడు !

కుచే:—సురుచిరకరుణాప్రపాలితభక్తసంచయుఁ డారమానాథుఁడు !

శిశు:—ప్రళయోద్యత్ప్రతాపమార్తాండమండలుఁ డీచైద్యాధిపతి !

కుచే:—నిజవిలోచననీకాశితసూర్యశశిపీతిహోతుఁ డాద్వారకాధిపతి—

శిశు:—అధమా !

సీ. మత్తేభములపాదమర్దనవధియింప
వాసుదేవుండు కాపాడువాఁడె ?

కుచే:—మత్తేభవరదుఁడే మాపాలవసియింప
మత్తేభములబాధ మాకు గలదె ?

శిశు:—కాలకూటవిషాగ్ని కాల్చి నిన్ హింసించి
వధియింప హరియె కాపాడువాఁడె ?

కుచే:—క్రోధకామాదిక క్రూరవిషాగ్నిని
మాయించు ఘనున కీబాధయెంత !

శిశు:—రక్తకూపోద్రిక్తసక్తుని నిగ్గజేసి
ముంచి హింసించి బాధించువాఁడ !

కుచే:—సం[illegible]బగు; కాని సంసారకూపవా
సము బాపు హరి కసాధ్యమును కలదె !

శిశు:—గీ. ఇదియె ! వధియింతు - నధమ నీ కెవరుదిక్కు ?

కుచే:—భ్రాంతి యేటికి రాజేంద్ర ! ప్రబలుఁ డనుచు

దిక్కులకు దిక్కు దిక్పతి దివ్యదిక్కు
హరియె దిక్కందఱికి - నీకు - నాకు - నధిప !

శిశు:—అధమా ! యింకను నీయధికప్రసంగములు మానవా ! భటులారా ! యీదురాత్మని బాధింపుఁడు. హింసింపుఁడు. వీరందఱు నాశత్రుపక్షచరులగుటచే నారాజ్యమునందుట రాజనీతివిరుద్ధము. కావున వీనిని భార్యాపుత్రులతో మనరాజ్యమునుండి పారద్రోలుఁడు. నేనింద్రప్రస్థమున ధర్మజుఁ డొనరించు రాజసూయ యాగమునకై రేపు తొలిజాముననే వెడలుచున్నాఁడను. మంత్రులారా ! రండు. (నిష్క్రమము)

ర:—కుచేలా ! అయినదా నీభక్తికి ప్రతిఫలము ! ఏమి చింతించుచున్నాఁడవు ?

చే:—బ్రాహ్మణోత్తమా ! నేను నాకొఱకై చింతించుటలేదు. మరణించిన నారాఘవునికై చింతించుటలేదు. నాభార్యాపుత్రాదుల దుర్గతికై యించుకంతయు చింతించుటలేదు. అయ్యది కర్మానుబద్ధము కాని, సోదరా!

ర:—అయిన నెవరికొఱకై చింతించుచున్నావు ?

చే:—నీకొఱకై మాత్రము నేను చింతించుచున్నాను!

ర:—మూర్ఖా! ఏల ? ఎందుకు ?

చే:—ఏమందువా ? నాపై నీకుగల యసూయచే, క్షణక్షణమును, నరకసోపానముల నొక్కొక్కటియే యధిరోహించుచున్నాఁడవుకదా యని చింతిల్లుచున్నాఁడ—

ర:—చాలునీయున్మత్తాలాపములు! నాబావమఱఁదియగు దీక్షితునకు నీతనయను సుందరాక్షి నొసంగువిషయమున నదియే కడమాటయా !

చే:—ద్విజచంద్రమా ! ఆహాను దేవునియభీష్ట మట్లున్నది !

కర—అజ్ఞనా ! అయిన నీభార్యాపుత్రులతో నీకిక నీదేశమున తావు లేదు.

కుచే:—ఆగోవిందుని యభీష్టము !

కర:—నీభార్యాపుత్రులతో నీదేశమును విడిపోవలయు !

కుచే:—ఆబృందావనలోలుని యాజ్ఞ.

కర:—నేడే వెడలిపోవలయునుమా !

కుచే:—ఆపుండరీకాక్షుని దివ్యతరేచ్ఛ !

కర:—అందఱును వెడలవలయు !

కుచే:—ఆనందనందనుని లీల !

కర:—కృష్ణుఁడును నీవును యేటకలియుదురుగాక ! మూర్ఖా ! ఇది గోపాలునిదికాదు—కరటకశాస్త్రి యాజ్ఞ ! తెలిసినదా ?

కుచే:—ఆగోపాలకృష్ణుని సంకల్పము.

కర—అవివేకి ! నీవిప్పు డెవ్వరితో మాట్లాడుచున్నావో యెఱుఁగుదువా ?

కుచే:—నా శ్రీ కృష్ణునితో—

కర:—ఎందున్నాఁడు నీకృష్ణుఁడు.

కుచే:—అదుగో - అందు - అందు - ఇందు - యిందు—

ఉ. అన్నిఁటిఁ గాంచి లోకముల నన్నిఁటి గాంచుచు నన్నినంటకన్
యన్నిఁటినుండి యన్నిఁటిని నంతరమందునఁ జేర్చు కృష్ణు నీ
వెన్నకయున్న నల్లదిగో? నీహృదయంబున నుండె !—

కర:—(హృదయమును చూచుకొనుచు) ఏదీ ! కనుపించుటలేదే ?

కుచే:— సంశయా!

స్కన్నులుకాంచరావిభువి!

కర:—మఱియెవ్వరు కాంతురు ? మూర్ఖులా ?

కుచే:— సత్వమయుల్ తిలకింత్రుసోదరా!

కర:—నాహృదయమున కృష్ణుఁడు కాఁడు- నీతలపై శనియున్నాఁడు.
అధమా ! అనుభవింపుము నీకర్మను ! (నిష్క్రమి)

కుచే:—అదిగో కృష్ణుఁడు—కృష్ణా!

(అనుబంధము ౧౫)

(భటులచే నీడ్వఁబడుచు నిష్క్రమణము)





శ్రీ

# భక్తకుచేలనాటకము.

## తురీయాంకము.

### ప్రథమరంగము.

(అరణ్యప్రాంతము. ప్రవేశము - వామాక్షి)

వామా:—

సీ. సుతుల బల్వెతలకై శోకించు ననుహితో
క్తుల నూరడించు నిస్తులితలీల
ఫలపర్ణముల దెచ్చి తలిదండ్రులకొసంగి
వారి నారాధించు భక్తిలీల
శ్రీకృష్ణకథల నాలించి గంతులువైచి
యంగంబు మఱచు బాల్యంపులీల
ఆదరంబున 'రాఘవా!' యని పిలువ తా
ప్రేమచే నను కౌగలించులీల

గీ. శౌరి పాడుచు వివశుండై చనెడులీల
'అమ్మ! కృష్ణుని చూపు'మం చడుగులీల
యకట! రాఘవా! తనయ! నీయసమలీల
మదిని నెంత మఱతుమన్న మఱువఁగలనె?

అక్కటా! తనయా! మరణించునపు డెంత యాచ్ఛాదనమైన నొసంగనేరని నిర్భాగ్యులగు నీజననీజనకుల నెంతదూరితివో? ఎంత సంకటపడితివో! మానిష్కరుణాగ్ని యొక్కవైపునను, ప్రచండ తరమధ్యందినమర్తాండునిసహస్రకిరణదీప్తి యొక్కవైపును నిను

దహింప, 'దాహము! దాహ'మని యఱచుచు యెంత వేదనబడితివో? యదునందనా! గోకులానందా! నీ వాకర్షణము కాన్పింపకున్న యశోదా నందు లెంతయో బాధపడరా! నీవు వారి కెట్లో? నాకుమారుఁడును నాకట్లే గదా! అలనాడు మీ గురుపత్ని తన కుమారులకై నిను వేఁడ నిరుపమానకరుణాంతరంగితహృదయుఁడవై యా కుమారుల - నామె కొసంగలేదా! నేనును నామెవలె ప్రార్థింతును. నేను నీ మిత్రుని పత్నిని కానా! గోవిందా! నాఁ తనయుని నాకిమ్ము. నా రాఘవుని నా కొసం గుము. లేకున్న—(లోస 'అమ్మా' యని) అయ్యో! చచ్చినవానికై యేడ్చుచు బ్రతికియున్న పసిపాపలనే మఱచితినే—కుమారులారా! యిదే వచ్చితి—(నిష్క్రమము.)

(యవనిక నెత్తనొక్క తరుప్రకాండముపై శిరముంచి కుచేలుడు నిశ్చేష్టుఁడై)

(ప్రవేశము - కుచేలుఁడు దీనవదనముగ)

సీ. చెలిమి 'కృష్ణా!' యని పిలువ తా చిఱునవ్వు
వెదజల్లు చల్లని కుదురుమోము
మురళి వాయింప డాల్ మొనయుచు నటియించు
నాసిక మౌక్తికం బలరు మోము
చదువుచో తెలిచిన పెదవులలోనుండి
జగములు మెదలాడ నెగడు మోము
గురుసేవ నలయగా పరగు నిట్టూర్పుల
నాల్గువేదంబుల నలరు మోము

గీ. జగతి మఱపించు నెమలి ఫించంబు మోము
కాంచ కస్తూరికాతిలకంబు మోము
మాదు గోపాలు నగుమో మదేది? యెందు
చనియె? యెందు దాఁగెనో? లేదే! శౌరి యకట!

(తలయెత్తి) కాదు. కృష్ణా! కాదు—

ఉ. నాయది తప్పుకాదు కరుణామయ! నన్నిటు పెంచి నొంచుటల్
సీయది తప్పు సర్వమును నీదగు ప్రేరణకాదె చేసితిన్
నీ యపరాధ నిష్కృతికి హింస యొనర్పఁగ నన్ను ధర్మమే?
సాయక మేయువాని విడి సాయకముల్ మఱి నింద సేతురే?

అంధునిచేతిదండమును గొని, మార్గదర్శకుఁడై, కొని చని, మార్గమధ్యంబున, నిమ్నోన్నతప్రదేశమున తటాలున చే విడచి, యంధుఁడు క్రిందపడిన యపరాధమంధునిదగునా! అట్టివాఁడవు నాకేల జన్మమొసంగితివి? ఇంతవఱకేల పాలించితివి! ఇపుడు కనుపింపకపోయ్యు, సనకసనందనాదియోగిహృదయగుహాలలో దాగినమాత్రమున వదలుదు నని తలఁచితివా! ఎంతవెఱ్ఱివాఁడవు కృష్ణా! హాహ్హాహ్హా!

[ప్రవేశము: వామాక్షి - కుచేలునిచూచి సంతసమున]

వామా:—నాథా! నాథా! ఏమిభాగ్యము. (నమస్కరించును)

కుచే:—హాహ్హాహ్హా! నీదొంగచేష్టలు నాకు తెలియును. లెమ్మి కృష్ణా! నాచెంత నీ యాటలు సాగిరావు! రమ్ము—రమ్ము.

వామా:—నాథా! నాథా! యిదియేమి? యెట్లువచ్చితిరి?

కుచే:—(దీనవదనుఁడై) రావా! కృష్ణా! ఇంకను కరుణకలుగదా! మిత్రమా! నీ కీకాఠిన్య మెట్లలవడియె? అలనాఁడహల్యా శాపవిమోచన మొనర్చుతఱి నాపాషాణకాఠిన్యము నీహృదయము నాశ్రయించెనా? లేక శరణాగతప్రహ్లాదబాలసంరక్షణకై దాల్చిననృసింహావతారమున నున్నకఠినత్వ మింకను నిను బాయదా! ఔను—నిక్కము.

మ. నిను నేవేళను గొల్చుభక్తులకు నెంతే కష్టసంతాపముల్
కనగాఁ జేయు నఘుంబునన్ సుతుఁడు నంగ రంబుపాలయ్యె న
చ్చినభార్యామణి దేశద్రిమ్మరియయెన్ శేషాహి నిన్బట్టె యి
ల్లనంభోనిధిచేరె! నిర్దయుల కానందంబు చేకూరునే?

వామా:—జీవితేశ్వరా ! కుమారు లాకలిచే మాడుచున్నారు, కొంద ఱు శోషిల్లి మూర్ఛిల్లియున్నారు. రాఘవుని కళేబరమున కగ్ని సంస్కారాది యంత్యక్రియల నాచరించు నుపాయమైన యోచింపవలదా ?

కుచే:—కానిమ్ము. కేశవా ! నీవైశ్వర్యమదమత్తుఁడవు ! సనకసనంద నాదియోగిపుంగవుల - ఉద్ధవాక్రూరాద్యంతరంగభక్తుల పూజా మహాత్మ్యముల నోలలాడుచు నీదీనుని మఱచితివా ! నీవుండు టయు లేకుండుటయు నాచే నుండుట మఱచితివి కాఁబోలు !

శా. నీరూపంబును మాపి నీవు జగతిన్ లేవంచు వేచాటు బౌ
ద్ధారూఢుల్ నినుముంచు చో గతియుకానా నీకు నేనక్కటా !
శ్రీరాగంబున కన్నుగానక మహోర్వి న్ముంచినా విట్టి చో
క్రూరాత్ముం డని చేర రెవ్వరు నినున్ క్షోణిన్ రమానాయకా !

వామా:—హృదయేశ్వరా ! మీరిట్లు లోకమునే మఱచి, యుపే క్షించిన పసిపాపలగతియేమి ?

కుచే:—(లేచి సంతసమున) ఆనందము ! ఆనందము ! ఇది యానందము! యియ్యదియే సచ్చిదానందచిన్మయస్వరూపదర్శనానందము ! కృష్ణా ! కృష్ణా ! ఏమి నీభక్తవాత్సల్యము ! తొలుత నీబాల్యాం కవిచేష్టరూపమును ప్రకటించి, పిదప, రుక్మిణీసత్యాసమేతమగు నీకల్యాణదివ్యస్వరూపమును నాకనులకుఁ దోపఁజేసి, యిపుడు, కేవలచిత్కళాభాస్వరమై, నిర్గుణనిరంజననిర్వికారనిరామేయనిఖిల స్వరూపమైన—వటపత్రమున శయనించిన నీదివ్యస్వరూపమును ప్రదర్శించితివా ! ఆహా ! అదే— అల్లదే— విరాట్పూరుష విద్యోతమానవిజ్ఞానఘనస్వరూపము - భూనభోంతరాళవ్యాపియై- సర్వదిశలు, నవగ్రహములు -ద్వాదశాదిత్యులు-చతుర్దశభువనం బులు, సప్తార్ణవధరాధరకాననతరుపరివేష్టిత ధరామండలంబంతయు

నీవయై — విలోచనస్థానప్రకాశితశతసహస్రసూర్యచంద్రుఁడవై! యెందుచూచిన యేవైపుపరికించిన నీవయై ప్రకాశించుచుంటివా భళిరే! సనకసనందనసనత్సుజాతాదిమౌనినికరంబులు! అయారే! చతుర్ముఖ కమలాసనాధ్యాసితనాభీకమలంబు! ఆహా! నిగమ గోచరా — వేదాంతసారా — ఉపనిషద్వేద్యా — ఆనందము — ఆనందము. కృష్ణా! ఇదియే మానసకమలాసనపీఠము! ఉపవేశింపుము! యివియే కుసుమములు — ఏదీ? దేవీ! ఆవాసుదేవుని సమర్పనకై రాఘవుని పూజాకుసుమముల తెమ్మనుము!

వామా:— అక్కటా! ఈమహానుభావున కేమని ప్రత్యుత్తరమిత్తును!

కుచే:— ఆలసింపకుము! ఆవాసుదేవుఁడు వేచియున్నాఁడు. రాఘవుని శీఘ్రముగ కుసుమముల తెమ్మనుము!

వామా:— నాథా! రాఘవుఁడు మనల వీడి చనలేదా!

కుచే:— ఏమీ! రాఘవుఁడే లేఁడా! రాఘవుఁడే లేకున్న ధర్మ మెందుండ గలదు? ప్రపంచ మెందుండఁగలదు! అదిగో రాఘవుఁడు — రమ్మనుము —

వామా:— నాథా! మన కుమారుఁడు రాఘవుఁడు.

కుచే:— దేవీ! యిదియేమి? నామాట కెన్నఁడును మాఱుపలికి యెఱుంగవే! రాఘవుని - పిలువుము. భ్రాంతా! రాఘవునే చంపఁజూచితివా! అదే అందుండలేదా! కనుపించుటలేదా! చూడుము!

వామా:— (పరికించి — శవము కనుపింపనందున) ఆహా! యిదియేమి? మృతకళేబర మెందుచనియె! నాథా! —

కుచే:— బేలా! యింకను సందియమేనా? రాఘవా!

('జనకా!' యను ధ్వని—వామాక్షి—రిచ్చవడిచూచును. పూజా కుసుమముల చేతధరించిన రాఘవునిపట్టుకొని నారదుఁడు మందహాస మున నిలచియుండును.)

నార:—'యాదృశీభావనాయత్రసిద్ధిర్భవతితాదృశీ!' పరమభాగవత వర్యులసంకల్పము లమోఘములు! (సమీపించును)

వామా:—(స్తంభితయై) కుమారా!

రాఘు:—జననీ! యిదేవచ్చితి. (నమస్కరించును)

వామా:—కుమారా! రాఘవా! (ఆలింగన మొనర్చుకొని) ఎట్లువచ్చి తివి? ఎందుండివచ్చితివి? ఎవ్వరు కనికరించిరి నాయనా—?

రాఘు:—అమ్మా! ఆయాసభరమున కన్నులుమూసితి. ఎవ్వరో యొక మహాత్ముఁడు శంఖచక్రగదాభిరాముఁడు, మందహాసాంచిత వద నుఁడై—నాయెదుట సాక్షాత్కరించెను. ఈపూర్ణచంద్రుఁ డామహనీయునిచెంత నిలచియుండెను. మేన నెట్టి యాయాస మునులేదు. ఆకలిబాధలేదు. కనులు తెఱచి చూతుఁగదా ఆమహా నీయు డంతర్ధానమందియుండెను. అందు కుసుమములుండ కోయుచుంటిని. ఈహాసచంద్రుఁ డరుదెంచి నీజనకుఁడు పిలచు చున్నాఁడు రమ్మని నన్నిందు తోడ్తెచ్చెను.

వామా:—నాయనా! ఎట్లువచ్చితి నేమి? క్రిమ్మర నిన్ను గర్భవాస మున ప్రసవించినట్లయ్యె! ఆహా! ఆముచికుందవరదుని భక్త త్రాణపరాయణత నేడుగదా తిరమయ్యె!

నార:—సాధ్వీమణీ! పాహియన్నవారి కామోక్షసామ్రాజ్యమునైన నొసంగు నాసర్వేశ్వరునకు నీకుమారు నొసంగుటనఁగ నెంత? ఇదియంతయు శ్రీకృష్ణలీల!

కుచే:—రాఘవా! యేదీ ఆకుసుమముల నిట్లిమ్ము. (రాఘవుఁ డొసంగ పూజించి) కుమారా! ఏదీ యానందనందనుని మంగళగీతమును వచింపుము!

రాఘు:—

శ్లో. ఆనందోజ్వల నందనందన సనందానంద బృందవనా
ళిందోజ్జృంభితపాదపద్మ నిగమాబృందానువిందా హరే
విందతత్వమరందసుందమిళిందా మానిమందార శ్రీ
కందర్పోజ్వలకోటికోటినిరసచ్ఛృంగారమాముద్ధరా !

(మంగళహారతి నొసంగుదురు)

(అనుబంధము. ౨౦)

నార:—కుచేలా ! ఆశిశుపాలుఁడు రాజసూయయాగమున నాకృష్ణ మూర్తి చక్రాయుధమున కెఱయైనందునకదా మఱల మీరంద ఱును నిందు చేరగల్గితిరి !

వామా:—నాథా ! ఆనందనందనుని యపరిమితానానురాగమును సంపాదించి యీదారిద్ర్యాంధకారము బాయవలదా?

శా. శ్రీనాథుం డఁట విశ్వమెల్ల తనదా చిత్రానురూపంబటఁ
తానే సర్వశరణ్యుఁడఁట మన మాదామోదరున్ కుక్షికై
దీనత్వంబున వేడరాదె ? శిశువార్తిన్ తల్లినిఁ వేడదే ?
పానీయంబును చాతకం బడుగ శుంభన్మేఘమున్ పాపమే ?

కుచే:—దేవి ! నీవెంతమూఢమతివి ! సర్వేశ్వరుని సభక్తి తాత్పర్యముల నారాధించుట దారిద్ర్యమును బాపుకొనుటకా ? పవిత్రతర మైన కామధేనువును గొల్చి గొల్చి తుదకు గోమయమును కోరుమనియెదవా ?

వామా:—లోకమున దారిద్ర్యముకన్న వేరుదుఃఖముకలదా ?

కుచే:—సర్వజంతువులకును నోగిరమిచ్చి కాపాడ సర్వేశ్వరుఁడు లేఁడా ?

నార:—ఏసర్వేశ్వరుఁడైనను తన్నర్చించి ప్రార్థింపకున్న తనంతతా ప్రసాదించునా ?

కుచే:—పురాకృతకర్మఫలమున నెట్టి వారి కేతీరున జరుగవలయునో యాతీరున జరుగుచుండలేదా ?

నార:—పురుషప్రయత్నము లేకున్న దైవ మేమిచేయఁగలఁడు? మరు భూమి నుపవేశించి 'దైవమా ! పాయసమి' మ్మనిన మాత్ర మున లభించునా ?

కుచే:—దైవసహాయమే లేకున్న మనుజప్రయత్నము మాత్రము ఫల వంత మగునా ?

వామా:—పదివిధముల మనుజుఁడు ప్రయత్నింప దైవము పదునొ కొండై ఫల మివ్వఁడా ?

కుచే:—అందుకు దైవమేమి చేయఁగలఁడు. దేవీ ! మనకర్మ మన మనుభవింపవలయుఁగాక !

నార:—దైవము నారాధించుటయే సత్కర్మకాదా? అట్టి సత్కర్మకు ఫలము లభింపదా !

కుచే:—మునీంద్రా ! దేవీ ! కూరేమైన నరుఁడు ! తుచ్ఛతరసంపద లకై యాదేవదేవు నెన్నఁడును ప్రార్థింపఁజాల ! అయ్యో ! తన్వీ!—

చ. కనులకు పైత్యరోగమున కన్పడు పెక్కులు వన్నె లట్లు స
ద్వన తరుపల్లవంబుల ప్రభాచయమట్లు సుసాంధ్యశోభలన్
కనుగొనినట్లు సంపదల కాంతురు భక్తులు కాని వానికై
మనమున కోర రెవ్వరవిభావన మూర్ఖులెగాక భామినీ !

వామా:—కష్టా! నాథా ! నేనేమందును ! కన్నకుమారు లాకలిచే కన్నులయెదుట మడయుచుండ, పవ లెండ వేడిమిచేతను, రాతిరి చలిచేతను, కట్టుట కింత వసన మేనియు లేక పసిపాపలందఱు మాడి మంటగలియుచుండ కనులార నీసంతాపమును చూచుచు నూరకుండవలయునా ? అన్నాతురములైన ప్రాణుల బ్రోచు

టయే కదా మిముఁ బోలు సాధుజనుల లక్షణము. ఇట్టి భూత హింసను బాపుటయేకదా ధర్మము! ఆలక్ష్మీకళత్రుఁడు—ఆకాంచనచేలుఁడు మీ కెంతయు ననుంగునెచ్చెలికాఁడా? అట్టి కూరిమి మిత్రుని—నందనందనుని దర్శించి యీ దారిద్ర్యమును బాయవలదా?

కుచే:—అయ్యో! దేవీ! నాకెంతయు ధర్మపత్నివై, ధర్మకర్మసాక్షిణివైన నీవే యిట్లాడసగునా? 'సుతులు,సుతు' లని వందురుచుందువుకాని నీకు వీ రీజన్మమున సుతులు—నిక్కువము—యొప్పికొందును. కాని, వెనుకటి జన్మమున వీ రెవ్వరి తనయులు? ముందు రానున్నజన్మమున వీ రెవ్వరికి తనయులై జనియింపనున్నారు?

మ. ధర సంసారనదీప్రవాహమున యేతత్పుత్రదారానుజో
త్కరముల్ సేరు స్వకర్మబంధమున తత్కర్మానుబంధంబు యే
తఱివాయున్ విడిపోదు రందఱును మిథ్యానాటకం బిద్ది యో
తరుణీ! యెవ్వరు వీరు? వీరికయి చింతల్ సేయ నీకేటికిన్?

నారః:—బ్రాహ్మణోత్తమా! ఇట్టి వైరాగ్య మెంతటివారి కలవడును? మనమున నెట్టి సుజ్ఞాన ముదయించినను, దాని నంతరమందుంచి, ప్రపంచమునం దుండువఱకు, మానవుఁడు ప్రపంచవ్యాపారము ననుసరింపనే వలయుకాదే? 'నీవు—నేను!' అను సంబంధ మెంతవఱకుఁ గలదో, 'భార్య, పుత్రులు' అనుసంబంధ మెంతవఱకు గలదో యంతవఱకు మానవుఁడు ప్రపంచము ననుసరింపనేవలయు. తనపై నాధారపడియున్న కుటుంబమును పోషింపనేవలయు! అట్లు పోషింపకున్న ధర్మము తప్పినవాఁడగును. దాన పాపము కలుగును!

సీ. సహపాఠియై మున్ను శౌరితో సమముగా
సాందీపముని చెంత చదువలేదె ?
'ఆత్మవత్సర్వభూతాని' నాఁ జగమెల్ల
హరిరూపమయముగా నరయవలదె ?
అవని "పరోపకారార్థమిదంశరీ
రం" యను టాత్మఁ దలంపవలదె ?
ఆకలి యని యేడ్చి నవిసి చచ్చెడివారి
పాలించుటే ధర్మపథముకాదె ?

గీ. జగతి 'భూతాని యన్న మిచ్ఛంతి' యనియు
ధర 'శరీర మాద్యం ఖలు ధర్మసాధ
న' మ్మనియు నెంచి హరి చూడ నరుఁగవలదె ?
'యెఱుక పిడికెడుధనమంచు' నరయవలదె ?

కుచే:—మునీంద్రా ! ఆధర్మమును నిర్వర్తించుటకై యేగదా నే నీ యుంఛవృత్తి నాశ్రయించుట ! అదియే యయాచితవ్రతము! కాని, ధనముకై యితరుల యాచించి, యాచించి, స్వకీయతపః ఫలమును నీటఁగలుపమందురా ?

వామా:—నే నాముకుందుని ధనమునకై యాచింపుమంటినా ? దర్శింపుమంటినిగాక ! ఆ రమానాథుని—కూర్మిమిత్రుని పరమేష్ఠిజనకుని దర్శనమే మనకు సర్వకల్యాణముల చేకూర్పదా ?

కుచే:—ఏమీ ! ఏమీ ! నానందనందనుని దర్శించుటకా ! నాగోవిందుని దర్శించుటకా ! భళి ! భళి ! నేడెట్టి సుదినము ! తప్పక నేగెద ! సంతోషమున నేగెద ! భళి ! ఎంత చల్లనిమాట వచించితివి ! దేవీ—నాగోవిందుని, నాకూర్మిచెలికాని దర్శనము—భళి ! రేపే వెడలెద !

మ. జలధిన్ ద్వారకలో మణీగణలసత్సౌధాంతరాళంబులో
పల భర్మాంచితసాలభంజికలభవ్యానందపీఠంబునన్
అల సత్యావర రుక్మిణీకలితుఁడై యంభోజపత్త్రాక్షు క
న్నుల విందారగ నెందు గాంతునో ? లసన్మోదంబు చేకొందునో ?

దేవీ ! నేనే యనేల నేఁడే పయనమొనర్చి పంపరాదా ? ఆ—
మఱచితి—దేవీ ! ఆలక్ష్మీకళత్రుని—పరమేష్ఠిజనకుని—లీలామానుష
విగ్రహుని—నాకూర్మిమిత్రుని—యిన్నిదినములకు మఱల నేదర్శింపఁ
బోవునపుడు చేత నేమైన నుపాయనము కొనిపోవలదా ! చూడుము.
దేవీ ! ఇంట నేమైన పిండివంటయో, ప్రీతిపూర్వకమగు ఫలమో
యున్నదేమో ?

వామా:—అయ్యో ! యీనిర్భాగ్యురాలి కట్టిభాగ్యము సైతము గల్గునా ! నాథా ! మనయింట నావాసుదేవుని కర్పింప నర్హమగు వస్తువేదియు లేదే—

రాఘు:—ఉన్నవి—ఉన్నవి ! జననీ ! నాఁడు నీవు నాకొసంగినయడుకులు—ఆగోవిందుని నివేదనకై యే దాచియున్నాను. కొని తెత్తునా ?

కుచే:—కొనితెమ్ము నాయనా ! సర్వవిధముల నీవే ధన్యుఁడవు,

(రాఘవుఁ డడుకుల కొనితెచ్చును)

వామా:—నాథా ! ఆలక్ష్మీకళత్రునకు—ఆకాంచనచేలునకీపాతవడిన నీరసంపుటడుకులనా మన మొసంగుట ?

రాఘు:—తల్లీ ! కొండంతదేవునకు కొండంతపత్రిచే నెవరైన పూజింపఁ గలరా ?

నార:—భళీ ! కుమారా ! సాధ్వీ ! సభక్తితాత్పర్యములతో నొసంగెడు యడుకులేల ? తులసీదళమైనను, తృణమైనను నా సర్వేశ్వరుఁడు తప్పక స్వీకరించును ! రాఘవా ! నీవొసంగిన

యదుకులే యాంపరమేశ్వరుని నివేదనచే కృతార్థములగుగాక ! మీా కష్టముల కంత్యము చేకూర్చుఁగాక ! కుచేలా ! ఆ శ్రీకృష్ణమూర్తియందు మానసముంచి, తన్మయుఁడవై చనెదు నీకు మార్గమున నెట్టి యాటంకములును కలుగఁజాలవు ! రమ్ము ! ఆనందనందనుని ధ్యానించి పయనమున కుపక్రమింతువుఁగాక !

(అనుబంధము. ౨౧)

యవనికపతనము.

---

రెండవరంగము - ద్వారక.

[శ్రీకృష్ణభజనలు. అనుబంధము. ౨౨ ప్రవేశము కుచేలుఁడు - తన్మయుఁడైయాడి భజనపదములు చనిన పిదప]

కుచే:—

శా. ఆనందంబులకెల్ల నుత్కటమహానందంబు సౌభాగ్యసం
ధానంబౌ ఘనభాగ్యసీమ శ్రుతివిద్యారామకీరంబు శ్రీ
మీనాక్షీమణిహంసడోలిక సదామేయప్రభాగోళ మా
మానీంద్రస్తుతిశాల ద్వారక ! యదే భాసిల్లెగా భవ్యమై.

ఉ. ధేనులు మోములెత్తి హరి దేవమయున్ నుతియింపసాగె నం
భా నద మొప్ప లేగ లటు మాధవకీర్తన చేయసాగె యెం
దైనను కాన నట్టి హరి యవ్యయుభక్తి మహామహంబు నీ
మానవజంతుసంతతి కనంబడె నౌర ! మహాద్భుతంబునై !

ఉ. పాడుచు శ్రీహరిన్ సతులు పాల మథించెడివారు దాసులున్
వేడుక కృష్ణకీర్తన నివేశిత కృత్యముసేయువారు మేల్
జాడలవీడరీకృపికసంతతిమాధవు గానలోలులై
యాడుచు నుంద్రు బాలకులు యంబుజనాభునిమూర్తి గొల్చుచున్.

అదే! నానాసువర్ణమయగోపురంబులచే నెంతయు మనోజ్ఞమై వెలరారు నదే మాగోవిందునిమందిరమై యుండనోపు! ఆహా! అవియు తమ యనంతమహిమచే నాపరమేశ్వరుసాన్నిధ్యమును చాటుచున్నవి కదా! ఆహా! యేమా కలకలము? ఎందఱుజనులు గుమిగూడి యున్నారు! ఓహో—అదే—

ఉ. రాజు లదెందఱో తమకరంబుల కానుకలెల్ల బూని కాం
భోజ కళింగ వంగముఖభూవరమండలనాథు లెందఱో
వాజులపై మదేభములపై మణిహేమవితానమంది తా
మాజగదీశు కానరఁట నష్టదరిద్రుఁడ నాకు శక్యమే!

(నిష్క్రమము)

---

మూడవరంగము—ద్వారక

[శ్రీకృష్ణమందిరో ప్రాంతము- సంమచితవస్త్రాలంకృతులగు నిరువురు ద్వారపాలకు లుందురు. రాజులు, భక్తులు ద్వారసామీప్య ప్రదేశమున కానుకలతో వేచి యుందురు.]

1. రాజు:—అయ్యా! ద్వారరక్షకా! నేడు శ్రీకృష్ణమూర్తిదర్శనమునకు మాకర్హత యున్నదా?

1. ద్వార:—లేదు. నేడు శ్రీవాసుదేవమూర్తి శ్రీరుక్మిణీసత్యభామాదేవీకరకంకణమణిప్రభలలో సుస్నాతుఁ డగుసమయ మిది! ఇపు డెవ్వరిని లోనికి రానివ్వకూడదని మాకు కఠినముగ నాజ్ఞయైనది.

2. రాజు:—అయ్యా! ద్వారరక్షకా! నావిన్నపమును శ్రీవారి శ్రోత్రసన్నిధానమునకు దెచ్చితివా?

2. ద్వార:—తెచ్చితిని. కాని ప్రభువు మందహాసమున మోము మఱియొక వైపుకు మఱల్చెను.

3. రాజు:—నేను కాశ్మీరప్రభువతంసుఁడను. నాకును నిదియే ప్రత్యుత్తరమా?

1. ద్వార:—మీరుకాదు. తుద కా విరించి చనుదెంచినను నిదియే ప్రత్యుత్తరము.

4. రాజు:—అయ్యా! నేను చిరకాలమునుండి వేచియున్నాను—నాకు.

2. ద్వార:—చిరకాలమునుండి వేచియున్నను — అచిరకాలమునుండి వేచియుండినను సమయముమాత్ర మియ్యదికాదు.

[ప్రవేశము—కుచేలుఁడు]

కుచే:—

చ. 'ఫలముల పర్ణశాల తొలిపల్కు పొలంతి శిరఃప్రసూనమా
కలిమి పడంతి కేళిగృహకంజము తాపసహంసడోలికా
జలజవనంబు మోక్షధనసన్నుతపేటిక వాసుదేవు వె
న్నెలచిఱునవ్వు నామది స్ఫురించెడిభాగ్య మదెందుకల్గునో?'

1. ద్వార:—ఏమి బీదపారుఁడా! ఎచ్చటినుండి వచ్చితివి? ఎచ్చటికి పోయెదవు?

కుచే:—ఎచ్చటినుండి వచ్చితిని—ఎచ్చటికి పోవుట? అదియే ప్రశ్న? అయినను, సోదరా!

ఉ. ఎచ్చట చేరు లోకము లహీనమునీంద్రులు నెందు చేరువా
రెచ్చటనుండి లోకముల సృష్టి చెలంగు సుఖానుభూతులై
యెచ్చటివారు రారు మఱి యీజగతీస్థలి కెందు భక్తిమె
యెచ్చటి కీవు నేను తుద కేగెద మచ్చటినుండి వచ్చితిన్.

ద్వార:—చాలు చాలు పొమ్ము. బిచ్చ మడుగుట కెన్నియో గృహము లున్నవే రాజద్వారముకడ నేమిపని?

కుచే:—నేను గోవిందుని దర్శనభిక్షకై వచ్చియున్నాను. నేను కుచేలుం డనువాఁడ—

ద్వార:—అది నిన్ను జూచిననే తెలియఁగలదు. కాదయ్యా! ప్రభు దర్శనమునకు వచ్చువాఁడ వింత యొడలు తుడచికొనుటో, తుద కింత ధవళవస్త్రమును ధరించుటయైనవలదా? ఈవేసమున వచ్చుట కిది యేమి నాటకమని భావించితివా?

కుచే:—కాదా? నాటకముకాదా! సందియమున్నదా?

ఉ. యాదవసూనుఁడే నటుఁ డనంతజగం బది రంగభూమి మా
యాదరమే తెఱల్ మనుజులందఱు నాటకవేషధారు లా
మోదము ఖేదముల్ రసము భూమి వినోదవిచిత్రచర్యలే
కాదె సునాట్యవైఖరులు కాంచ ప్రపంచమె నాటకం బగున్.

సోదరా! సత్త్వమయమైన ధవళవస్త్రమును, సచ్చిదానందమయమైన యుత్తరీయమును నాయట్టివానికి లభించునా? నేను శ్రీకృష్ణుని బాల్యమిత్రుఁడను—

ద్వార:—హాహ్హాహ్హా! నెఱ్ఱివాఁడా! నీయట్టివాఁడా శ్రీగోవిందుని బాల్యమిత్రుఁడు. నీకేమియు నున్మాదము కలుగదుకదా?

కుచే:—ఆయున్మాదమునుండి తప్పించుకొనుటకై యే కదా నే నింత దూరము వచ్చినది.

ద్వార:—చాలు చాలు వెడలిపొమ్ము.

కుచే:—సోదరా! నీసంతసమునకైన వెడలుచుంటిని. కాని, నే నా ముకుందుని దర్శింప నెంతయో దూరమునుండివచ్చితిని— యెంతయో శ్రమించితిని. అట్టి నన్ను 'మాని వెడలిపొమ్మ'నుటకు నీకు నర్హతలేదు. వెడలుటకు నాకును నర్హతలేదు.

ద్వార:—ఇది శ్రీకృష్ణమూర్తి రుక్మిణీసత్యభామాదేవులతో నేకాంతముగ నుండు సమయము.

కుచే:—అట్లనా! మఱియు మేలయ్యె. అయిన తప్పక నిప్పుడే లోని కేగవలయు—(పోఁబోవ)

ద్వార:—(ఆపి) ఇప్పు డెవ్వరిని లోనికి రానివ్వకూడదని మాకు కఠిన ముగ నాజ్ఞయైనది.

కుచే:—తన్ను దర్శింప చనుదెంచు భక్తుల నిరోధింప నా వాసుదేవ మూర్తి కెట్టి యర్హతయు లేదు.

ద్వార:—పోగరుబాపఁడా! రాజాధిరాజు లెందఱో వెనుదిరిగిపోవు చుండ నిన్ను నిరోధింప నా వాసుదేవమూర్తికే యర్హతలేదా? ఊరకపోయెదవా! లేదా?

కుచే:—సోదరా! అగ్రహము సర్వజనులకును నిషిద్ధమే! కాని, సత్యమునందు — సత్యాగ్రహము మాత్ర మనుసరణీయమే యగును కాన మీ రేమన్నను మానను—(పోఁబోవ)

ద్వార:—ఏమీ! వీరాధివీరులగు మమ్ముల మీఱిపోయెదవా? నీకేమి బలము కలదని మమ్ముల ధిక్కరింతువు?

కుచే:—సోదరా! నా బలమా!

సీ. జనకుబాధల సైచి తనభక్తి మానని
ప్రహ్లాదబాలకు బల మదేది?
యమువెంట చని ప్రేమ నాత్మేశు బ్రతికించు
వరసాధ్వి సావిత్రి బల మదేది?
పలువిఘ్నముల కోర్చి బ్రహ్మర్షియైన వి
శ్వామిత్ర తిలకుని బల మదేది?
జీవకోటికి మేలుచేయగాఁ దీ మహా
త్ముల పావని ధృవుల బల మదేది?

గీ. అవని నేలాటి బాధలనైన సైచి
పశుబలంబు నణంచి విశ్వంబు నెల్ల

ప్రేమవాహినిలో ముంచి భేదబుద్ధి
బాపు నాసాత్త్విక నిరోధబలము లేదె ?

[అనుబంధము 23 పోఁబోవ]

ద్వార:—(అపుచు) ఆ - ఆ—మమ్ము మీఱిపోవుటకూడనా ! హొమ్మ. బాధనందెదవు—

కుచే:—సంతోషము—[అనుబంధము 23 లోని చరణము]

ద్వార:—హింసింతుము.

కుచే:—మిక్కిలి సంతసము—[అనుబంధము 23 లోని చరణము.]

ద్వార:—హొమ్మ. హింసింతుము. బాధింతుము. దండింతుము.

కుచే:—చాల సంతసము. కాని, సోదరా ! ఎవరిని ?

1. ద్వార:—ఎవరెని?—నిన్నే—మఱియు నిన్నే—

కుచే:—సంతోషమే కాని, నన్నే యన నాయంతరాత్మనా ? నా శరీరమునా ?

2. ద్వార:—ఏమి ? ఆత్మ - శరీరము—? రెండున్నవా ?

1. ద్వార:—కుచేలుఁడు మూఢవవాఁడా ! చాలు నధిక ప్రసంగము నిన్నే ?

కుచే:—యోచింపుఁడు. నన్నే యన నాయంతరాత్మనా ! నాశరీరమునా ?—నాయంతరాత్మ యాగోవిందుని, ముకుందునియందు లీనమై యున్నది. దానిని నిరోధించి, వేరుచేసి దండించుటకు మీకేకాదు, మీకు, నాకు సర్వలోకములకు ప్రభువగు నా సర్వేశ్వరునికి సైతము కాఁజాలదు ! ఇఁక నీశరీరమును నిరోధింతు నందురా ? అది మాత్రము మీచే నగును. కాదనను, కాని, దాన మీ కేమిలాభము ? మీరు నన్ను లోని కేగ నివ్వకున్నను, నే నిందేయుండి నిరసనవ్రతమున, నాభక్తిపాశములచే నావాసుదేవమూర్తి ని బంధించి, యీడ్చి తెచ్చి, నామానస

కనకసింహాసనమున నుంచి, పూజించెద ! ధ్యానించెద—భజించెద! దానిని మీ రేమైన నిరోధింపఁగలరా? ఇంతకాల మాపరమేశ్వరసాన్నిధ్యముననుండియు నింకను మీకు 'నేను?' అను నహంకార మణఁగలేదా ?

1. ద్వార:—మహాత్మా! క్షమింపుము! అహంకారబాధితులమై మీ మాహాత్మ్య మెఱుంగమైతిమి. రండు మీరాక నావాసుదేవమూర్తికి విన్నవింతు—(నిష్క్రమము - అనుబంధము. ౨౮)

(యవనికపడును.

---





శ్రీ

# భక్తకుచేలనాటకము.

## పంచమాంకము.



### ప్రథమరంగము—ద్వారక  శ్రీకృష్ణునియంతఃపురము.

[రుక్మిణియంకమున శిరముంచి, సత్యభామాదేవి యంకమున పాదములుంచి, జాంబవతీ మిత్రవిందలు వింజామరల వీచుచుండ, కాళిందీలక్షణలు సుగంధద్రవ్యముల నర్చించుచుండ—చేటీజనులు సేవలకై వేచియుండ శ్రీకృష్ణమూర్తి విలాసముగ పరుండియుండును.

కృష్ణ:—

గీ. పడుచు లేచుచు నున్నారు ప్రాణు లకట
భవజలధి మున్గి క్రోధలోభ జలజంతు
బారి జిక్కి తా దరిగాంచు పథము లేక
కన్నుగానక గర్వాంధకారు లగుచు !

రుక్మి:—సత్యా ! ఏమట్లున్నదానవు ? మననాథునిసన్నిధానమున కామ క్రోధాదు లుండఁజెల్లునా?

సత్య—ఇదియంతయు శ్రీకృష్ణలీల ! కావుననే యూపారుఁడు విజయ మందె ! అయినను—

[ప్రవేశము - ద్వారపాలకుఁడు.]

ద్వార:—దేవా ! విజయోస్తు ! ద్వారమున—

సత్య:—ఓరీ ! యిది యెవ్వరికిని సమయము కాదని వచింపలేదా? పామ్మావల !

ద్వార:—మహారాజ్ఞీ ! నేనదియే వచించితిని—కాని యాపారుఁడు విననందున—

సత్య:—వినకున్న మెడబట్టి యావల గెంటింపుము ! తెలిసినదా ?

ద్వార:—భాగ్యము. కాని—ఆ ద్విజచంద్రుఁడు—

సత్య:—ఏమీ ! మఱల వచింపవలయునా ?—

రుక్మి:—సోదరీ ! యించుక శాంతింపుము ! ఓరీ ! ఆ పారుఁడు వల దన్నను వినలేదా ?

ద్వార:—దేవీ ! నే నెంతవచించినను ఆబ్రాహ్మణుఁడు మానఁడయ్యె.

రుక్మి:—ఆ - అట్లనా ! (కృష్ణుని చూచుచు-మందహాసమున) అయిన నా పారుఁ డెవ్వరు ?

ద్వార:—మహారాజ్ఞీ ! ఎవ్వరో కుచేలుఁడట—

కృష్ణ:—ఆ—ఆ—కుచేలుఁడా ! (పీతాంబరము జారుచుండ సావేగ ముగ లేచి) కుచేలుఁడా ! నాబాల్యమిత్రుఁడా ! ఓహో ! యేమి సుదినము !

మ. ప్రవహించెఁ గద గంగభిక్షుకుని సద్మం బందు మందారమే
ప్రవిరోహించె దరిద్రునింట సఖుఁడై భక్తావళీరత్నమై
భువి రాజిల్లు కుచేలుఁ డీ నగరితాపూతంబు గావించె ! మి
త్రవరేణ్యుఁ గను టెంతకాలమునకుఁ భాసిల్లెగా బాపురే !

రుక్మిణీ ! తెమ్ము ! తెమ్ము !! మణిమయపాత్రలతో దివ్యోదక ముల గొని తెమ్ము పాద్యమునకు ! ఓరీ ! ఏల నిలచితివి ? పొమ్ము నా మిత్రుఁ డెంత యాతురతతో వేచియుండునో ! సత్యా ! నీవు పోయి సుగంధబంధురకస్తూరికామిశ్రితపన్నీటిజలముల సిద్ధపఱుపుము స్నాన మునకు ! ఓరీ ! ఆగుము. ఇంచుక నాశ్చర్యము కలిగింపవలయు. మే మా మిత్రు నెదుర్కొందుము ! జాంబవతీ ! ఏ మట్లు నిలచితివి ?

నీకేమియు తోఁచదా ? భవ్యతరభృంగామలకతైలసౌరభపుష్పతైలా దుల నాయత్తపఱుపవలదా ? మిత్రవిందా ! నీవు—ఘృతశర్కరాదులచే కూడిన రుచిరతర పక్వాన్నముల సిద్ధమొనర్పుము ! నీకును వచింపవలయునా లక్షణా ! పొమ్ము. ధౌతములై యభిరామములైన దుకూలముల సేకరింపుము—ఇక మనోజ్ఞములై—నుఱచితి. లెండు ! లెండు ! నామిత్రుఁ డెంత నాకై వేకరుచుండునో !

సత్యా:—నాథా ! యిదియేమి ? పురందరాదు లరుదెంచినపుడైన తుదకా విరించి చనుదెంచినపుడైన యింత యాదరణ ప్రకటింపవే ? నేడేల యీయాదరణ ! యీపారుఁడు—

కృష్ణ:—నాయంతవాఁడు. నాకు, నీకు సర్వలోకములకు పూజనీయుఁడు.

రుక్మి:—సత్యా ! యిపుడైన తెలిసితివా ? మన నాథునకు, నీకంటె, నాకంటె, తుదకు తనకంటెను భక్తులే యధికులు !

[లోన ౨౫ అనుబంధములోని చరణము.]

అదే ! నారదసంయమీంద్రుఁడు వచ్చుచున్నాఁడు.

[ప్రవేశము నారదుఁడు. అనుబంధము. ౨౬]

కృష్ణ:—తాపసచంద్రమా ! విచ్చేయుము. మంచి సమయముననే విచ్చేసితిరి. మీతో ప్రారంభింపబడిన నాటకము మీతోడనే ముగియవలయుకదా ! ఆహా ! నేఁ డెట్టి సుదినము.

(అనుబంధము. ౨౭ నిష్క్రమము.)



రెండవరంగము - శ్రీకృష్ణప్రాసాదనమున నౌకశాల

(కుచేలుఁడు చిత్రములపరికించుచు)

కుచే:—ఇది మాకృష్ణుని కాళీయమర్దనలీల నభివర్ణించు చిత్రము. ఇది రాసక్రీడాభివర్ణనము ! యిది పదియారువేల గోపికాంగనలతో

సలలితకారణాం బనఘసత్తమ ! నీదగు దర్శనంబె నా
కిలను త్రికాలయోగ్యత నివ్వదె ! నా దగు భాగ్య మల్పమే!
మిత్రమా ! వివాహముచేసికొంటివా ? భార్య (సత్య నైపు
చూచుచు నించుక మందహాసమున) అనుకూలవతియే కదా !
సంతానలాభ మేమైన కలిగినదా !

కుచే:—ఇరువదియేడ్గురు!

కృష్ణ:—ఇందఱకును నామోదకమేకదా ? మిత్రమా !

చ. కుశలమె నీకు ? నీసుతులకుఁ మఱి నీసతికిఁ శుభంబె? శ్రీ
వశలయి పుత్రికల్ పతి నివాసములందు వసింతురే ? సదా
పశువులు గోవ్రజంబులును పాల నొసంగునె ? శిష్యు లాగమా
భ్యసన మొనర్తురే? జపతపంబులు విఘ్నము లేక సాగునే.

కుచే:—అంతయు పరమామోదము. అంతయు నానందము.

చ. భయముల బాప నిర్భయశుభంబుల పెంప ఖలాళి నొంప పె
న్నయమున నీకృపామహిమరాజిలుచుండఁగ భక్తపాళికిఁ
భయ మెటుకల్గు ? దివ్యతరవర్ష జలంబులు పెంప సస్యసం
చయమున కెట్లు కల్గు రవిజాత ఘనాతపబాధ ! మాధవా !

కృష్ణ:—మిత్రమా ! ఎంత కృశించితివి ! (దేహము నిమురుచు)

చ. అలసితివో తపంబుల ? ననారతకర్మల గ్లానినందితో ?
కలచు కుటుంబభారమున గాసిలితో సతతోపవాసముల్
సలిపితొ ? నీశరీరము కృశంబయె నెంతయొ చిక్కినాఁడ వో
కలుషవిదూర మిత్రమ ! వికాసము లే దదియేమొ తెల్పవే !

కుచే:—కృష్ణా ! నందనందనా ! చిక్కితి సంపూర్ణముగ చిక్కితి.

ఉ. చిక్కితి నింద్రియంబులకు చిక్కితి భ్రాంతిమయాంధకారతఁ
చిక్కితి సంసృతిఁ సోలసి చిక్కితి క్రోధమదారిపాళికే
చిక్కితి జన్మమృత్యువుల చిక్కితి నీ దగు మాయ కింక నా
చిక్కుల బాపి యన్నిటికి చిక్కకయుండ ననుగ్రహింపవే !

కృష్ణ:—సఖా ! గ్రాస వాసములకు నీ కుటుంబమున కేమియు లోపము కలుగదుకదా ! మా శిశుపాలుఁడు నీ విద్యకు తగిన సత్కారము చేయుచుండెనా ?

నార:—మీ శిశుపాలుఁడే గా? చక్కని సత్కారము చేసెను. నీ మిత్రుఁ డగుటచే నయోమయ శృంఖలముల నలంకరించి, నీ జన్మస్థాన మును దర్శించు భాగ్యమును చేకూర్చెను.

కృష్ణ:—మిత్రమా ! పూర్వము మనము సాందీపముని చెంత విద్యాభ్యాసము చేయుచు గడపిన సంతోషకాలము జ్ఞాపక మున్నదా! లోకమున మానవునకు విద్యార్థిదశయే జీవితమునందలి మిక్కిలి సంతోషకరమగు కాలము సుమా ! ఆ దినము జ్ఞాపక మున్నదా !

సీ. తలనున్న బిందెల జలము పైఁబడుచుండ
సరకుసేయక మాని సతులు చూడ
జాగుసేయు సతుల చంప వచ్చిన పతుల్
కదలక కృత్యంబు వదలి నిలువ
జనని యంకము వీడి చని యేడ్చు శిశువుల
పాలిచ్చి ధేనువుల్ మరుపుచుండ
జనని కాఠిన్యత కని మొఱవెట్ట నా
వత్సముల్ మానుల పజ్జ నిలువ

గీ. పౌర్ణమాచంద్రు కిరణముల్ ప్రతిఫలింప
పారు సెలయేటి కలకలధ్వానములె యు
పశ్రుతియు కాగ ప్రకృతి గర్భమున నాఁడు
మురళివాయించు చిత్రంబు మరచినావె ?

ఆదినము మనగురుపత్ని మనల నరణ్యముల కింధనములకై బంప, మన మాటలచే నాలస్య మొనర్చుటయు, అచ్చట—

సత్య:—గొల్లవారిండ్ల వెన్న పాలుమీగడల హరించుటయు,

నార:—మోహిని నంపి పరాభూతి నందుటయు—

కృష్ణ:—గాఢాంధకార మావరించుటయు, కుంభవృష్టి కురియుటయు నిప్పటికిని కనులకు కట్టినట్లున్నది. అబ్బ! ఆ యురుములు—ఆమెఱుపులు తలఁచుకొన్న నిప్పుడును యొడలు పులకరించుచున్నది.

కుచే:—నిక్కము. భవాంధకారమును చూచి, పరువెత్తి, సనకాది మునివరేణ్యుల మానస గుహాలలో దాగు నీకది భయావహము కాదా!

కృష్ణ:—సత్యా! జాంబవతీ! ఆ నిజామరల గైకొని వీవుఁడు నామిత్రునకు మార్గాయాసమైన బాయఁగలదేమో!

సత్య:—జీవితేశ్వరా! ఇదఱు చేటీజను లున్నను నేనే—

నార:—ఔను. నీవే—సత్యాదేవి! నీ వెంతధనము వెచ్చించినను నిట్టి భాగవతశేఖరుని సేవాభాగ్యము లభించునా? వీవుము. సంకోచింపకుము.

కృష్ణ:—మిత్రమా! అపుడు నేను చలికి తాళఁజాలక వణఁకుచుండ—సత్యా—అప్పు డీమహానుభావుఁ డేమొనర్చెనో యూహింపఁగలవా? రుక్మిణీ! నీవు? మునీంద్రా! అప్పు డితఁడు జీర్ణవస్త్రుఁడయ్యును తన యేకవస్త్రము నొసంగి నన్ను రక్షించెను!

నార:—ఆహా! వస్త్రాపహరణవిషయమున నీనేర్పు గోపికల నడిగిన తెలియఁ గలదు.

కృష్ణ:—మిత్రమా! బాల్యసఖుఁడవుకదా! రాక రాక వచ్చితివి! నాకొఱ కేమైన తెచ్చియుందువు? ఏదీ యిట్లిమ్ము.

కుచే:—కృష్ణా! కృష్ణా! ఏమి నీభక్తవాత్సల్యము!- ఎంత దొంగవు కృష్ణా!

సత్య:—ఇదొక్కటి మాత్రము నిక్కము. దొంగతనము నాథున కుగ్గుతో పుట్టినది. బాల్యమందే గోపిక లిండ్ల వెన్నపా ల్మీగడల నపహరించెను—పిదప గోపికల వస్త్రములు!

నార:—సత్యాదేవీ ఎంత పొరపడితివి! ఆ భక్తవర్యుని యుద్దేశ మది కాదు. ఈ గోపాలకృష్ణుఁడు నిక్కముగ చోరుఁడే. ఈవేద చోరుఁడు భక్తిమై తన్ను భజించువారి పాపము లన్నియు నప హరించు నాశ్చర్యచోరుఁడు.

కృష్ణ:—మిత్రమా! ఈ రుక్మిణీసత్య లున్నారనియా సందియము! సంకో చింపకుము వారన్యులుకారు. (ఉత్తరీయమునుగొని—కనుల కద్ది—శిరమున నుంచి—తనపీతాంబరము నాతనికి ధరింప చేయును.)

నార:—ఆహా! ఏమి యీ యుత్తరీయ భాగ్యము! చినిగి, మలినమై యీ కాంచనచేలు శిరమున ప్రకాశించెగా!

కృష్ణ:—(ఉత్తరీయమునందలి మూటను విప్పి) ఓహో! యడుకుల దెచ్చితివా? రుక్మిణీ! రుక్మిణీ! ఈ యడుకులకై నే నెన్నిదినం బులనుండి వేచియుంటినో యెఱుంగుదువా! (పిడికెడు గైకొని భుజించును)

రుక్మి:—(జనాంతికము) ఆహా! ఏమి యీ యడుకుల భాగ్యము? ప్రాపంచికనిరీతి యీసర్వేశ్వరుఁ డడుకుల నుతింపసాగెగా!

సత్య:—(జనాంతికము) అది యడుకులభాగ్యముకాదు. గొల్లవా రిండ్లజనించుటచే నాథుఁ డెన్నఁడును నడుకుల చవి చూడని భాగ్యము!

కృష్ణ:—ఆహా! ఎంతరుచికరముగ నున్నవి! మిత్రమా! యివి స్వయ ముగ నీయర్థాంగియే రచించెనా! సంకోచింపకుము. దీన నా రాఘవుఁడు సంతుష్టినందఁగలడు. (మఱల భుజింపఁబోవు)

రుక్మి:—(కరమును గ్రహించి) ఆగుఁ డాగుఁడు. మిత్రుఁ డొసంగిన వానిని మీభార్యల కొసఁగకయే మీరు భుజింపనగునా! అందును మా చెలియలు వామాక్షీదేవి పంపినవికావా?

సత్య:—ఇదియేమి రుక్మిణీ! నాథుఁ డత్యాదరమున భుజించుచుండ వలదందువా! గొల్లవారిండ్ల జనించుటచే నాథుఁ డడుకుల నెఱుంగకున్నను రాజపుత్రివగు నీవును నెఱుంగవా? రమ్మి నామందిరమునకు వలయునేని—

నార:—ఒసఁగెదవా! సత్యాదేవీ! ఆయడుకులు సామాన్యములని తలంచితివా? పరమపతివ్రతాశిరోమణియైన వామాక్షీదేవి మానస హోమగుండమున జనించినవి. బాలభక్తాగ్రేసరుఁడగు రాఘవుని నవభక్తి మర్దితములైనవి! సర్వలోకశరణ్యుఁడగు నా సర్వేశ్వరుని నివేదనచే కృతార్థములైనవి.

సీ. వేడితస్తంబులై వీడి మోహపుతెఱ
మొనయు సత్వమయంపుమూర్తు లివియొ,
బాధించి మర్దించి పైనణంచినవారి
కాహార మిడి బ్రోచు యనఘు లివియొ;
దధిని పాలను నీట తగజేరి సఖ్యత
కలసి వర్తించు నిష్కలుషు లివియొ;
ఘనులకోరక ధనఘనులనుకోరక
హరికృప పేరుగు మహాత్ము లివియొ;
గీ. యట్టియడుకుల పిడికెడు నారగించి
భవ్యుడై భవసౌఖ్యసంపదల నొసఁగె
మఱల భుజియింప శౌరియే భక్తునింట
దాసుఁడై సేవఁజేయుచు తనరవలదె!

కృష్ణ:—మిత్రమా! తృప్తుఁడనైతి! ఈ యడుకుల కింతపాలు—

కుచే:—కృష్ణా! ఈద్వారకయందలి పా లన్నియుఁ నీ పాలై యుండ నాకు పా లెట్లు లభించును?

రుక్మి:—నాథా! ఆభక్తవర్యుఁ డొసంగతగినదంతయు నొసంగియే యున్నాఁడుకదా! మఱల నింకేమొసంగఁగలఁడు?

సత్య:—బాగున్నది. మనయింట పాలేలేవా! ఆబీదపారు నర్థించుటకు?

నార:—సత్యాదేవీ! ఇంకను తెలియఁజాలవా! ఆపుండరీకాక్షుఁ డర్థించు పాలు వేరు. నీవు భావించు పాలు వేరు.

సీ. 'శృతి' ధేనువులచెంత చెలఁగుచుండెడి పాలు
దోగ్ధగోపాలుచేఁ దోఁచు పాలు;
సంసారబంధముల్ సడలింపగను పాలు
మోక్షమైన నొసంగు ముక్తిపాలు;
మిన్ను మన్నుల కేకమిత్రత కను పాలు
వైకుంఠభాండాప్తి వఱలు పాలు;
తనవారు తనుపీడుతఱి వెంట చనుపాలు
ప్రేమవాహినిబుట్టి వెలయుపాలు

గీ. రంగు లన్నిట రంగారి పొంగు పాలు
నీకగమ్యమై తోఁచక నెగడు పాలు
పాలు గోపాలు కనఁజాలు పాలు పరమ
భక్తి నాత్మార్పణ మొనర్చుపాలు భామ.

కృష్ణ:—మిత్రమా! నన్నెప్పుడైన స్మరించుచుందువా? నీవనవరతము నాహృదయకుహరమున మెదలుచునే యుందువుసుమా!

కుచే:—నేనొక్కఁడనే! కృష్ణా! ఈపదునాల్గుభువనములును నీ హృదయకుహరమున మెదలుచునే యుండలేదా!

నార:—సత్యాదేవీ! యిప్పుడైన భక్తితత్వము నెఱింగితివా! ఆ పరాత్పరునకు వీరు వా రను భేదము లేదు.

సీ. 'వేదశాస్త్రాధిక' విప్రవర్యుండైన
భువిని నీచుండైన మూర్ఖుఁడైన
యుత్తమోత్తమ భూసురోత్తముండైనను
కేల నంటఁగ గాని మాలడైన
మహితసామ్రాజ్యైకమండలేశ్వరుఁడైన
పిడికె డన్నములేని బీదఁడైన
బహుళప్రేమాధిక భక్తవర్యుండైన
వధియింప నేతెంచు వైరియైన
గీ. నవని నెవ్వాఁడు కాని తన్నధికభక్తి
'పాహి ! మాంపాహి' యని వేడవచ్చెనేని
వాఁడె మిత్రుండు పుత్రుండు బాంధవుండు
భక్తవర్యుండె దైవంబు మాధవునకు

రుక్మి:—నాథా ! మిత్రసందర్శనమహానందమున నామిత్రునిమార్గాయాసమును మఱచితిరి !

కృష్ణ:—ఔను ! దేవీ! నీవుపోయి యభ్యంగనమునకై సర్వమును సిద్ధ మొనర్చుము. సత్యా ! నీవు పక్వాన్నముల నాయత్త మొనరింపుము ! మిత్రమా ! రమ్ము! (దండమును గ్రహించి— తిన్నఁగ నడిపించుచు) తిన్నఁగ రమ్ము. అయ్యో ! ఎంత కృశించితివి. ఇఁక నీ కాయాస ముండదు లెమ్ము. కష్టములు బాధింపవు లెమ్ము. నీసతీసుతులవిషయ మడుగ మఱచితికదా! భోజన సమయమున వచింతువఁట లెమ్ము. ఆహా ! ఎంతసంతోషము.

(అనుబంధము. ౨౮)
(అందఱును నిష్క్రమము)

---

మూడవరంగము-కుచేలుని గృహసామీప్యప్రదేశము

[ప్రవేశము కుచేలుడు పీతాంబరధారియై మణిభూషణహారాద్యలంకృతుడై]

(అనుబంధము. ౨౯)

కుచే:—ఆహా! నే నెట్టి ధన్యుడను. ఆగోవిందుని దివ్యమంగళమూర్తిని ప్రత్యక్షముగ దర్శించి సేవించుభాగ్యమును గంటిని. పాపము నాసతీమణియు, తనయులును నేను ద్వారకనుండి సంపదల మూటకట్టుకొని వత్తునని సంతసమున నుందురుకాబోలు! ఎంతవెఱ్ఱివారలు! ఆముకుందుని దర్శనానందమున నాకీతుచ్ఛ తరసంపదలవిషయమై జ్ఞాపకమైన నుడునా యని యోచింప రైరి! ఆహా! యిది మాకుటీరప్రాంతము కాదా!

సీ. సంచరింపవదేమొ చారు దర్భాంకురా
నతశిరంబులునైన హరిణచయము?
పలుక రావేలకో 'స్వాగతం భవతు తే!'
యని పిల్చురాజకీరాళు లిందు?
కనుపింపరేలకో కాంతమరాళాంగ
నాపరివృతముని నాతు లిందు
ఎదురురారేలకో హృద్యవేదస్తవ
పావనసుతశిష్యపాళి నేడు?
గీ. నటవిసేవకకోటివిహారమేల?
గజతురంగాదు లిందు రా కత మదేమి?
కనులు కానరావో? భ్రాంతి కల్పితంబొ?
మాయయో? కృష్ణ నీ దివ్య మహిమ యేమొ?

నేనిందు పొరవడలేదుకదా? ఇందు నా కుటీరము లేదె? (యవ నికనెత్త దివ్యతరమణిమయసౌధము కాన్పించును) ఆహా! యిది యేమి? మణిమయప్రాకారకుడ్యములచే నవరత్నస్థగిత నానాసాలభంజి

కలచే నలరారు ద్వారబంధములచే చేటీజనసహస్రముచే నలరారు నీదివ్యతరప్రాసాద మెవ్వరిది ? ఇదియు మాశ్రీకృష్ణునిమందిరమును బోలియున్నది ? (పరివేశము సేవకుఁడు) నాకుటీర మెందున్నదో ! యితనిని ప్రశ్నింతునా ? అతఁడేమి భావించునో ? అయ్యా ! నిన్ను చూడ నీమందిరోద్యోగివలె కాన్పించెడిని. ఈప్రాంతమున నొక జీర్ణ కుటీరముండుట నే చూచిన జ్ఞాపకము ! దయయుంచి యది యిప్పు డెందున్నదో వచింపఁగలవా ?

సేవ:—బ్రాహ్మణోత్తమా ! యిం దెట్టి కుటీరమును నే నెఱుంగను. ఇది మాప్రభునిప్రాసాదము ! ఇందు మిముఁ బోలు ద్విజసత్తములకు చక్కని సత్కారము కలుగఁగలదు. విచ్చేయుఁడు మందిరాభ్యంతరమునకు !

కుచే:—అయ్యా ! క్షమింపుము. నాకేల సత్కారము ! తెలిసియున్న నాప్రశ్నకు ప్రత్యుత్తర మిమ్ము. లేకున్న నాదారిని నే బోయెద!

సేవ:—స్వామీ! విధిలేదు ! మీరు మందిరాభ్యంతరమునకు రానే వలయు. ద్విజు లెవ్వరువచ్చినను సరియె సమర్యాదగ లోనికి కొనిరావలయునని యాజ్ఞయైనది.

కుచే:—నీ ప్రభునియాదరణ కెంతయు సంతసించితిని. అయిన పథశ్రాంతుఁ డనై యీజీర్ణ కుచేలములతో నీప్రాసాదమునకుఁ రాజెల్లునా ?

సేవ:—ఆర్యా ! మీకేమియు నున్మాదము కలుగదుగదా ?

కుచే:—ఏల ?

సేవ:—లేకున్న మీరు ధరించినవి దివ్యతరపీతాంబరములుగాక, జీర్ణ చేలములగునా?

కుచే:—(పరికించుచు దిగ్భ్రాంతుఁడై) ఆహా! యిదియేమి ? నాజీర్ణ చేలములు దివ్యతరపీతాంబరము లెట్లయ్యె ! (చేతులు చూచి) ఈ భూషణము లెచ్చటివి ? (తలనున్నపాగాదీసి) ఈ దివ్యాంబర మెచ్చటిది ?

సేవ:—ద్విజసత్తమా! ఇంక నైన లోనికిరండు!

కుచే:—అయ్యా! నేను దూరదేశమునుండి యిప్పుడే వచ్చుచున్నాను. ఇంకను నాభార్యాపుత్రులనైన చూడలేదు. కాన—క్షమింపుము.

సేవ:—అది కానిపని. ఆగుండు. మాచిన్నిప్రభువుగారిని పిలుతును. ప్రభూ! ప్రభూ! [ప్రవేశము రాఘవుండు - సముచితవస్త్రాలంకృతుండై - దివ్యాభరణభూషితుండై]

కుచే:—(స్వగతము) ఆహా! నాకనులకు భ్రాంతికలుగమకదా! వీడు మారాఘవుండుకాండా? అయిన—?

రాఘు:—(కుచేలుని చూడకయే) సేవకా! విషయమేమి?

కుచే:—(స్వగతము) కంఠస్వరమును నదియే! సందియములేదు. కాని-

సేవ:—దేవా! నేనెంతప్రార్థించినను నా బ్రాహ్మణోత్తముండు—

రాఘు:—ఏదీ మాద్విజచంద్రుండు? (పరికించి - సంతోషమున) ఆహా! ఏమి నాపుణ్యము! జనకా! జనకా! (నమస్కరించును.)

కుచే:—తనయా! తనయా! నీవు మా రాఘవుండవేనా? (పరికించి-యాలింగన మొనర్చుకొని) తనయా! అయిన నిదియేమి?

రాఘు:—జనకా! ఆవిషయ మావల వచింతు! తొలుత మీకై పరితపించుచు కృశించుచున్న మాజనని కీసంతోషవార్తం దెలుపనిండు! అమ్మా! అమ్మా!

[ప్రవేశము-వామాక్షి సర్వాలంకారశోభితయై - వెంట చేటీజను లనుసరింప]

కుచే:—ఆశ్చర్యము! ఆశ్చర్యముపై నాశ్చర్యము!

రాఘు:—రమ్మా! రమ్మా! అతిథి యనుచుంటివే. అతిథిసత్తముండు వచ్చియున్నాడు. రమ్మా. పూజింపుము.

[వామాక్షి - పరికించి - సంతోషమున నమస్కరించును]

కుచే:—దేవీ! లెమ్ము! ఈవేషమేమి? ఈభూషణము లెచ్చటివి? ఈ మందిర మెవ్వరిది?

రాఘు:—మనదే—

కుచే:—ఈదివ్యప్రాసాదమా! ఈ సేవకసహస్రములు?

రాఘు:—మన పరివారమే!

కుచే:—దేవీ! మీ కీసంపద లెట్లు ప్రాప్తించెను?

వామా:—నాథా! మొన్న భౌమవారమురాత్రి - మనకుటీరముననే దర్భశయ్యలపై శయనించితిమి. ప్రాతఃకాలమున చూతుముకదా! హంసతూలికాతల్పములనుంటిమి. మన కుటీరమున కుమారీ దివ్యహర్మ్యరాజ ముండెను. ఏ మూల చూచినను ధననాసులే, ఎందుచూచినను సేవకబృందములే! ఈసేవకుల ప్రశ్నించితిమి కాని వారెల్ల నిది యాగోవిందుని మహిమ యనుటకన్న వేరు వచింపరైరి!

కుచే:—ఇది యాలీలామానుషవిగ్రహునిమహిమ యనుటకు సందియములేదు. ఆభౌమవారముననే నే నాపరాత్పరుని దర్శించితి! ఆరాత్రియే నేనును హంసతూలికాతల్పమున శయనించితి! అక్కటకటా! కృష్ణా! నందనందనా! నేను నాయర్థాంగి పలుకు లాలకించి, దారిద్ర్యబాధల ననుభవింపఁజాలక నాతన్వి వేడికోలు ననుసరించి, నీచెంత కరుదెంచితిననియా నన్నీ తుచ్ఛ తరైహికసంపదల ముంచి, బాధింప నెంచితివి? పరమపురుషా! ఐశ్వర్యమదమత్తుఁడనై, భోగాసక్తికి మనమున తావొసంగి నీచరణనళినసాన్నిధ్యదూరుఁడనై భ్రష్టుఁడగుక్రూరశిక్ష నాకేల యొసంగితివి! అయ్యో! ధనమదాంధునకు నీసాన్నిధ్యము చేరవలయునన్న సూక్ష్మతరమగు సూదిమొనయందలి రంధ్ర

మును మదేభము చేరఁ బ్రయత్నించినట్లేకదా ! అయ్యో !
నా కింకేమిగతి ? నేనేమపరాధ మొనర్చితి ? ఏకాలుష్యమునకు
మనమున తావొసంగితి ? కృష్ణా ! నందనందనా ! (లోన-అను
బంధము. 30)

రాఘు:—జనకా ! నారదమునీంద్రుఁ డరుదెంచుచున్నాఁడు.

(ప్రవేశము - నారదుఁడు-అనుబంధము. 30)

నార:—(అందఱును నమస్కరింప) కల్యాణమస్తు ! కుచేలా ! యిది
యేమి ? ద్వారకనుండి సంపదల మూటకట్టుకొని వచ్చితివా !

కుచే:—మునీంద్రా ! అదియే నాయపరాధము ! అదియే తొలిజన్మ
మున నేనొనర్చినపాపముల కాపరాత్పరుఁడు విధించిన ప్రాయ
శ్చిత్త రూపశిక్ష !

నార:—కాదు—కుచేలా !

మ. జలధిన్ చేరు నదీనదంబుల కీ షద్భేదమున్ లేని రీ
తి లవంబైనను నీకు కృష్ణునకు నెంతే భేద మొప్పారదో
జ్వలితానంద ! భక్తశేఖర త్రిలోకీవంద్యుఁడౌ నీకు నే
వలనన్ మాదృశులెల్లఁ జాలుదురె ? పాదాంగుష్ఠమున్ పోలగన్!

(లోన-అనుబంధము. 31 చరణము)

రాఘు:—అది యెవ్వరువచ్చునది ? యోగినివలె నున్నది ?

[ప్రవే-మోహిని-విరాగినియై-అనుబంధము.]

మోహి:—మునీంద్రా ! అభివాదనములు ! మహాత్మా ! అభివాదన
ములు.

నార:—వాసుదేవానుగ్రహప్రాప్తిరస్తు ! మోహినీ ! ఈవేషమేమి ?

మోహి:—సంయమీంద్రా ! ఇదియే నాకానందదాయకము.

[లోన కలకలము-ఆక్రందనధ్వనులు]

కుచే:—రాఘువా ! లెమ్ము ! లెమ్ము. ఎవ్వరో మాక్రందనమొనర్చు చున్నారు. పోయి వారికి సాయ మొనర్తుము. [రాఘువుఁడు నిష్క్రమము. కుచేలుఁడు పోఁబోవ-నారదుఁ డాపి]

నార:—ఆగు మాగుము ! కుచేలా ! అది కరటకశాస్త్రిగృహము. అతని పాపములకు ప్రాయశ్చిత్తముగ-యన్యాయ మొనర్చి సంపాదించిన మణివితతితో - ధనరాసులతో సకుటుంబముగ నాతని గృహ మగ్నిహోత్రుఁనిపాలై నది. దాని నణంప మానవ మాత్రులచే కాఁజాలదు.

కుచే:—అయిన నాహరాత్మరుఁడే దిక్కు' సకలసంతాపవారణా! వైశ్వా నరస్వరూపా ! సమస్తయజ్ఞ యాగాదిక్రియా కర్మసాక్షీ ! శాంతింపుము. శాంతింపుము ! కృష్ణా ! గోవిందా ! ఆనందస్వరూపి వగు నీ వీబ్రాహ్మణకుటుంబమునకు చందనశీతలుఁడవుకమ్ము ! నాకానందమును గూర్పుము ! సర్వసాక్షీ ! జలజాప్తా !

మ. వెలుఁగై యాంతరబాహ్యకార్యపదవీ వీక్షాప్రగల్భుండవై
యిల నాత్మీయవిభాప్రభావమున నావేశించి సంభర్తవై
కలితామ్నాయప్రసూనకర్మచయయుక్కాంతస్వరూపుండవౌ
జలజాప్తా ! భువనైకబంధో ! ద్విజు నశాంతంబు కాపాడవే !

రాఘు:—(ప్రవేశించి) జనకా ! అగ్ని శాంతించినది ! బ్రాహ్మణకుటుంబము రక్షింపఁబడియె !

[ప్రవేశము-కరటకశాస్త్రి శృంఖలాబద్ధుఁడై -యిరువురు భటులచే నీడ్వఁబడుచు]

నార:—ఓహో ! సోమయాజిగారు ! యిదియేమి ? తాము రాజేంద్రుని యాస్థానవిద్వాంసులే ! ప్రధానపురోహితులే ! మీకేల యీ నిర్బంధము ?

మోహి:—మహాత్మా! ఇతఁడు భార్యాప్రేరితుఁడై ప్రభువిత్తమును నపహరించెను. దానికై శిక్ష నందనున్నాఁడు.

నార:—కుచేలా! యితఁడు నీవైరి! యితనినుండియే నీకెన్ని కష్టములు కలిగె! అట్టివాఁడు శిక్షనందనున్నాఁడు. ఏమందువు?

కుచే:—మునీంద్రా! ఇతఁడు నాకు వైరియా! ఇతఁడు తనకే—తన మోక్షసంసిద్ధికే వైరియై పాపమార్జించుచుండె కదా యని చింతించుచుంటి కాని, యితనియెడ ద్వేషభావము నాకెన్నఁడును లేదు.

నార:—(స్వగతము) భళి! కుచేలా! నీ విపుడు సంపూర్ణముగ ధన్యుఁడవు.

కుచే:—భటులారా! యితనికి విముక్తిసాధనముకలదా! యితనిపరముగ నేనీ శిక్షననుభవించిన—?

సేవ:—స్వామీ! ఇతఁ డపహరించిన యిరువదివేల వరహాల నొసంగిన నితనికి విముక్తి కలుగఁగలదు!

కుచే:—అంతియేనా! పరాత్పరా! ఇదియా నీసంకల్పము. సేవకా! నీ వీ రాజభటుల కిరువదివేలవరహాల నొసంగుము. పాపము వీరు బీదవారుకాఁబోలు. వీరిగృహకృత్యమునకు వలయు ధనమును పారితోషికముగ నొసంగుము. (భటులు సేవకులు నిష్క్రమముః)

నార:—కుచేలా! ఇపుడైన ధనమునకును నుపయోగముండు టెఱింగితివా! సంపదలును మోక్షసాధనమునకు పారంపర్యముగనైన హేతుభూతములగునని సత్యాదేవివాదమునందలి యాదార్థ్యమును నిరూపించుటకై యే యాసర్వేశ్వరుఁడు నీ కిట్టియైశ్వర్యమొసంగె!

రాఘ:—జనకా! ఈ పారుని గృహము నిర్దగ్ధమయ్యెకదా! ఇఁక—

కుచే:—ఔను ! రాఘవా ! ఈ బ్రాహ్మణేంద్రునకు నూతనగృహనిర్మాణమునకు వలయు ధన మిప్పింపుము.

వామా:—నాథా ! నూతనభవననిర్మాణమగువఱకు కీతఁ డెందుండ వలయు !

కుచే:—నిక్కము. ధర్మసహాయినీ ! చక్కఁగ జ్ఞాపకమొనర్చితివి! శాస్త్రిగారూ ! తమ గృహము నిర్మింపఁబడువఱకు మాగృహమున తమ సాన్నిధ్యభాగ్యము నొసంగవేడువాఁడ.

కర:—వలదు. వలదు - మహాత్మా ! కుచేలా! వలదు (పాదముల మీఁదఁబడి) నాకు సౌఖ్యము వలదు. గృహము వలదు. ఏమియు వలదు. నే పరమపాతకుఁడను. నీవనుగ్రహింతువేని నాయపరాధముల మన్నింపుము. పశ్చాత్తాపకూపమునుండియుద్ధరింపుము. భక్తియోగ ముపదేశింపుము. దాసునిగ స్వీకరింపుము. ఇదే నాతనుప్రాణముల నీకర్పించితి.

కుచే:—సోదరా ! లెమ్ము. నీపాపముల తప్పక నాపరాత్పరుఁడు క్షమించును. సర్వప్రాణులును నా నారాయణస్వరూపులేకదా!

నార:—ద్విజచంద్రమా! లోకమున మానవుల నుద్ధరింపవలయు నన్న భక్తికన్న సులభమగుమార్గములేదు.

సీ. శ్రీరాగదయితుని చేరి యొక్కెడ నిల్వ
భక్తికన్న సులభపథము కలదె ?
తోడిప్రోడలులేని రేడు ప్రాపింపఁగ
భక్తికన్న సులభపథము కలదె ?
ఇందిరాకల్యాణి యెఱుఁగని హరిచేర
భక్తికన్న సులభపథము కలదె ?
లోకమోహనమాయలోన దర్శింపగ
భక్తికన్న సులభపథము కలదె ?

గీ. చిద్రసావేరితమనోజ్ఞచిత్రరూపుఁ
బడయ భక్తికన్న సులభపథము కలదె ?
ముక్తి భూపాల గోపాలమూర్తిఁజేర్ప
పరమభక్తికన్న సులభపథము కలదె ?

[ప్రవేశము—దీక్షితుఁడు—కృష్ణధ్యాన మొనర్చుచు]

నార:—దీక్షితా ! నీ కీకృష్ణభక్తి యెట్లలవడియె ?

దీక్షి:—సుందరాక్షి పుణ్యముచే.

కుచే:—కుమారా ! యిటురమ్మ. నీవనవరతకృష్ణపాదభక్తుఁడవే యగుదువేని సుందరాక్షి తప్పక నీయదియే యగు.

మోహి, కర:—మహాత్మా ! మా కాపరాత్పరుని దర్శించుభాగ్య మెన్నటికైన కలుగునా !

కుచే:—తప్పక కలుగును ! దృఢభక్తి వేడిన తప్పక నాకాంచనచేలుఁడు దర్శన మొసంగును.

శ్లో. కల్యాణం నః ప్రభూతం కలయతు కలితాలాపనీరేజబాలా
లీలాజాలానుకూలాశిశిరకరకలా భానుమాలావిలోలా
ఏషా శేషాహితోషా ఖలనిచయముషా కౌస్తుభోపేతభూషా
ముద్రా భద్రా వినిద్రామురహరణవిధౌ కాపికారుణ్యపూర్ణా !

[ప్రత్యక్షము- రుక్మిణీసత్యాసమేతుఁడగు శ్రీకృష్ణమూర్తి]

[అందఱు నమస్కరించి - హారతి నొసంగుదురు]

(అనుబంధము)

మంగళము.

శ్రీ శ్రీ శ్రీ



ఈపద్యము పొరబాటున ముద్రింపఁబడదయ్యె. దీనిని 24 పుటలో 1 వ పంక్తి—"రించినట్లు ప్రకాశించుచున్నాఁడు" అనుటకైన పిదప చేర్చవలయు.

సీ. తనకన్నజీర్ణమై చినిగి మోకాళ్లైన
దాటనిమలినవస్త్రంబు గట్టి
భవ్యమై ముడుతలవడియు తా నగుమోము
సరళమై బ్రహ్మతేజంబు చాట
సరితోపవాససన్నియతి కృశించియు
పూతమౌ తనువున బూది సలంది
సంస్కార మెఱుఁగక జడలుగట్టిన కురుల్
సంసారసుఖముల చాటుచుండ

గీ. తనువు మఱచి నృత్యముసేయుతఱిని నైన
గాయములె భూషణాకృతి గ్రాలుచుండ
చేత తులసి మాలలదాల్చి చింతలేక
భక్తియే రూపమును దాల్చి వచ్చె ననఁగ.

5. మో హి ని.

కలరే - యీజగతి - నన్ను - బోలువారు॥ కలరే॥
మోహనాగురల్ - మీరఁగలఁడేనా-
శృంగార - మహిమ - నిర - సింప ధర॥ కలరే॥

6. మో హి ని.

నాదమే - సురుచిర - మురళీ - నినాదమే - యది- సురు॥
కోకిల - కాకలి - లలితమనోజ్ఞమై - సొలపులనించెడిగా-
సదమల - మదవతి - హృదయములలరఁగ॥ నాదమే॥

7. మోహిని. రాగము-పహిడి-తాళము-ఏక.

సశరీరసుఖా - మొసఁగ - మేలా-
విరస - లీలా - నిరసింప॥ సశరీ॥
ధనమణిభాగ్యా - సంపదలొసఁగఁగ-
వీరిడివై యుటు - త్రోయఁగ - పాడియె॥ సశరీ॥

8. మోహిని. తాళము-ఝంప-రాగము-భాగేశ్వరి.

కాపాడు - మపరాధి - నేనైతి - గురునాథ॥ కాపా॥
విపరీత - మోహంబు - వెలయించితపచార-
మేనొనర్చితి - నన్ను - వీక్షింపుమోయనఘ॥ కాపా॥
బుధవినుతగుణశీలుఁ - డనియెఱుఁగకిట్టుల-
మూఢచిత్తనునైతి - మోహంబువిడనైతి॥ కాపా॥

9. కుచేల-మోహిని. రాగము-ఝంఝూటి-ఏకతాళము.

వనధినివాసా - వనజాక్షా - హరి-
శృతిభాసా - హరే - సరసిజనయనా॥ వనధి॥

సామజసంతోష - కౌస్తుభమణిభూష -
సన్నుతశ్రుతివేషా - పండితపోషా॥ వనధి॥

10. నారదుడు. రాగము - సారంగ - చతురశ్రమఠతాళము.

మురళీగోకుల - నందకృష్ణా॥ మురళి॥
నందకృష్ణా - ఆనంద - కృష్ణా- మురళి॥
మాని - లోలా - శ్రీ - లోలా॥ మురళి॥

11 సాధువులు. రాగము - ఇందోలా.

గోపబాలా గోప - బాలా॥ గోవర్ధనగిరిధారీ - శౌరీ॥ గోప॥
మానిలోలా - విమలా మధుతర - దరస్మిత - మంజులవదన॥ గోప॥

12. కుచేల - నారద.

కరివరదా - విమలా కమలానాథ॥ కరి॥
సారసాక్ష - శరణార్థిజనావన - కేశవ - గోవిందా - ముకుందా॥

13. వామాక్షి రాగము - కాళింగ.

తగునా - యీగతిమసలగ - మనుపగరాదా -
కరుణామయ-మముబ్రోచెదగనక॥ కదుపేదలపై॥ తగునా॥
సమయము - కాదా - మముగనకృప -
మనుపగ - ఉడిగిన - క్రూరత - గా - భువనా - భరణా - రమణా॥

14. సాధువులు 11-వ పాటయే

15. సరోజిని.

మోహాహత - గానంబే మది-మురుచిర - మోహానగానంబే మది మురుభి॥
[illegible] - రంజిల్లచేసెడి - సలలిత మానసమది॥ గానం॥

16. వాహూక్షి.

అకటా - కమలానాథా - కనుమా - కరుణాళో - దేవా॥ అక॥
తనయుఁ - దినమణిభానుఁ - దయచేకొనరాదే - శౌరి॥ అక॥
అతిథులకొగిరమొసఁగన్ - చేయఁగదె - లోకశరణ్యా॥ అక॥
కడుదీనుల - కనరాదే - భరమా - మముబ్రోవన్ - శ్రీశా॥ అక॥

17. నారద. సావేరి.

ఎవరున్నారుహరీ - ఇలనీ - సరి॥ యెవ॥
కరుణతోడనాశ్రితులకావగ -
సరసిజాసనాద్యమరవందితనీ॥ ॥సరి॥

18. కుచేల. మాల్కోస్ రాగము.

నారదాది - యోగివినుత-॥
నిరతఘనా - నందా - సామగాన - లోల - విమలా॥

19. కుచేల. రాగము సారంగ.

గోపాల - నుతవేద - శ్రీలోల - కృపరాదా -
శ్రీనాథ - ఘనకరుణ - ఘనుపనిధి - తటికాదా॥ శ్రీనాథ॥
ఇదె - నిన్ను - వేడువాడ - మునివినుత - హతదురిత -
ప్రణతోస్మి - యనుచుసదా - చరణ - నళిన - ములను - విడువ -
మాయా - మేయ - నుతవేద - గోపాలు - కృపరాద॥ శ్రీనాథ॥

20. అందలు. రాగ[illegible]హాన.

పాలయగోకుల - బాలా - పాలయ॥
కరుణాలోలా - భువనాపాల - లాలిత - లాలసభక్తజనాలయ - పాల॥

21. అందఱు. పైపాటలోనిచరణము.

మంధరధరధర - బృందవనచర - సదమల-
మదగజ - హృదయవిలోలా - విదళితదనుజ॥ పాల॥

22. అందఱు. భజన.

కావా - రావె - శ్రీ-గోపాల - బాలా - కృష్ణ॥ కావ॥
గోపాల - జయజయ - గోవింద - జయజయ-
పరమపావనా - కరుణనుగనుమా॥ కావ॥

23. కు చే ల.

కృష్ణకృష్ణ - కృష్ణ గోపాలబాలకృష్ణ !
కృష్ణకృష్ణకృష్ణ - గోవిందబాలకృష్ణ - ఆనందబాలకృష్ణ॥ కృష్ణ॥

24. కు చే ల.

రాధాకృష్ణలీల - తెలియ - రాధాకృష్ణలీల-
లేరు-దేవమానులున్ - ఆ-దేవమానులున్॥ రాధా॥
ఆర్తపాలుడనిజనులు - హరిదేవదేవుడనిమునులు—
కననొకండై ననిజమరయా - హరిమాయా - నెఱుగలేరు—
దేవమానులున్ లేరు - ఆ - దేవమానులున్॥ రాధా॥

25. నా ర ద.

నీదుకరుణా - లీలా - హరీ - మీరఁజాలగలరే॥ నీదు॥
గోవింద - నామ - మహిమా - హరీ - మీరజాలగరే-
మాయా-నాటకంబుజగతిన్ - మీరజాలగలరే॥ నీదు॥
కామక్రోధ - ములచే - కృష్ణా - దురహం - కారగతిచె
నాటకంబు - జగతిన్ - మీరఁజాలగలరే॥ నీదు॥

26, 27, 28, కృష్ణ.

సంతసమాయె - మదిలో - కనగా॥
అంతరమందు - మిత్రుని - గాంచక -
కలిగెను - చాలా - మదిలో - కనగా॥
సాదరప్రేమ - సత్కృతిసలుపన్ - కలిగెను చాలా - భళిరా॥

29. కుచేల

కువలయదళ - నీలంహారిం బాలం - భావయతాం॥
దళితదనుజసుకృతఫలం - కలితవిషయహాలాహలం -
బాలంభావయతాం॥

30. నారద, రాగము-రవిచంద్ర.

గోపాల - బాల - గోపికాలోల - విమలా॥
ఆనందమునిలోల - మురవైరిమారఘణ
నిరుపమానందకరుణా॥

31. మోహిని.

నాదబిందుకళాతీతనమోనమో -
వేదవందిత - శౌరి - నమోనమో -
మాని - మానస - లోలా॥ నమో॥
కార్యకారణస్వరూపా - నమోనమో -
భక్తమోక్షదహారే - నమోనమో -
మంత్రతంత్రస్వరూపనమోనమో

32. అంధఱు, మోహన - ఏకతాళము.

కమలా - నాభా - విమలవిభా -
కమలా - వాసా - కలుషహారా -

# చరిత్రలు—కథలు.

| | రు | అ | | రు | అ |
|---|---|---|---|---|---|
| హాస్యరసకథారత్నావళి | 0 | 8 | 16 రాజులకథలు | 0 | 12 |
| వినోదకథాకల్పవల్లి | 3 | 0 | పురూరవచక్రవర్తికథలు | 0 | 8 |
| ఆత్మకథ 1 భా॥ | 1 | 0 | మహాభక్త విజయం అను 30 భక్తులకథలు | 1 | 0 |
| డిటో 2 భా॥ | 0 | 12 | అరేబియన్ నైట్సుకథలు కంప్లీటుస్టోరీస్ | 1 | 0 |
| భట్టివిక్రమార్కునికథలు క్యాలికో బైండు | 2 | 0 | శుకసప్తతికథలు | 0 | 6 |
| హాస్యవల్లరి | 0 | 12 | గరుడపురాణము వచనము | 0 | 8 |
| చమత్కార కథాకల్లోలిని 1వ భా॥ | 0 | 12 | శారదాచట్టము(నూతనపద్ధతి) | 0 | 2 |
| డిటో 2వ భా॥ | 0 | 12 | శతకంఠ రామాయణ(వచనం) | 0 | 8 |
| అపూర్వ మనోహర చిత్రికథలు | 0 | 8 | పాండురంగభక్తవిజయము | 6 | 0 |
| మూడుచెప్పుదెబ్బలకథ | 0 | 8 | గురుభక్తవిజయము | 6 | 0 |
| అహిమహిరావణచరిత్ర | 0 | 8 | బౌద్ధమహాయుగము | 2 | 4 |
| పండితజవహరిలాల్ నెహ్రూ | 3 | 0 | ఆంధ్రులచరిత్ర 3వ భా॥ | 1 | 8 |
| రామతీర్థస్వామి | 0 | 8 | డిటో 5వ భా॥ | 2 | 0 |
| షట్చక్రవర్తుల యింద్రజాలపు కథలు | 0 | 6 | ఆంధ్రదేశపుచరిత్ర | 1 | 8 |
| భేతాళపంచవింశతికథలు | 0 | 8 | కాళిదాస్ ప్రకరణము | 1 | 8 |
| పంద్రెండురాజులకథలు | 0 | 12 | సానందోపాఖ్యానము | 1 | 8 |
| స్త్రీలవ్రతకథలు 1,2,3 భా | 0 | 12 | కాకతీయులచరిత్ర | 1 | 0 |
| రైతుఋణచట్టము | 0 | 1 | ప్రాచీనవిద్యాపీఠములు | 1 | 0 |
| మహాపతివ్రతలకథలు | 0 | 8 | పెద్దాపురసంస్థానచరిత్రి | 0 | 10 |
| మదనకామరాజుకథలు | 0 | 8 | కబీరుదాసు చరిత్రము | 0 | 8 |
| | | | ఆది & కోవారి పాండురంగ భక్తవిజయము | 6 | 0 |

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు, రాజమండ్రి.